చందమామ

సంపుటి 110 ఫిబ్రవరి 2004 సంచిక:2

## ఈ నెల విశేషాలు



భల్లూక మాంత్రికుడు-4

13



అనంతుడి కోరిక (బే.క)

19



విష్ణు కథ-2

45



యక్షిణులతో బేరం

51

## ఈ సంచికలో ...



**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail :
subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు పన్నెండు సంచికలు రూ: **900**
ఇం. యాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ.**120**లు
చందా డబ్బు, డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.



వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# భూమిని కాపాడుకుందాం!

నూతన సంవత్సర శుభారంభ వేడుకలు సద్దు మణగక ముందే, మలేసియాలో భూకంపం అనే వార్త కలవర పెట్టింది. అంతకు ఒకవారం ముందు ఇరాన్‌లో భయంకరమైన భూకంపం ఏర్పడి అతిప్రాచీన బామ్ నగరాన్ని నేలమట్టం చేసి 50,000 మంది ప్రాణాలను పొట్టన పెట్టుకున్నది.

భూకంపం ఒక ప్రకృతి వైపరీత్యం. దానిని అడ్డుకునే శక్తి మానవమాత్రులకు లేదు. అయితే, అది రాకుండా తగు జాగ్రత్తలు తీసుకోవడం మన చేతుల్లో ఉంది.

మానవ శరీరాన్ని కప్పి ఉంచే చర్మం చాలా ప్రధానమైనదని మనకు తెలుసు. అసంఖ్యాకమైన సూక్ష్మ రంధ్రాల ద్వారా, శారీరక ఉష్ణోగ్రతను కాపాడడం; స్వేద బిందువులను వెలువరించడం మొదలైన పనులు అది చేస్తుంది. సూక్ష్మరంధ్రాలు మూసుకు పోతే, మొటిమలు, పుళ్ళు లాంటి ఇబ్బందులు తలెత్తుతాయి!

అదే విధంగా, పెరుగుతూన్న జనాభా కారణంగా నగరీకరణ పెరుగుతున్నది. భూగర్భ జలాల కోసం, చమురు కోసం భూమి పైపొరనుతూట్లు పొడవడం వల్ల సమతౌల్యం దెబ్బతింటు న్నది. భూగర్భంలో కొన్ని అవాంఛనీయమైన మార్పులు చోటు చేసుకోవడంతో, భూగర్భంలో కదలికలు ఏర్పడతాయి. వాటి కారణంగానే ఉపరితలంలో భూకంపాలు ఏర్పడతాయి.

వీటికి తోడు మనిషి భూమి ఉపరితలంలోనూ, భూగర్భంలోనూ ప్రయోగాల పేరిట రకరకాల విస్ఫోటనాలు ప్రయోగిస్తున్నాడు. వీటి కారణంగా పర్యావరణం కలుషితమవుతోంది. నదుల కాలుష్యం రోజురోజుకూ ఎక్కువవుతోంది. మనం ప్రకృతిని నిర్లక్ష్యం చేయడం వల్ల, వాటి పర్యవసానాలు ఎలాంటి ముందు హెచ్చరికలు లేకుండా మన మీద హఠాత్తుగా విరుచు పడి నానా బీభత్సం సృష్టిస్తున్నాయి.

ఒక విధంగా, విలాసాల కోసం, వసతుల కోసం మనిషిలోని దురాశే ప్రకృతి ఉపద్రవాలకు కారణం అని చెప్పవచ్చు. పర్యావరణ సమతౌల్యాన్ని రక్షించుకుంటూ, దాని ద్వారా భూమిని కాపాడుకోవడం మన కర్తవ్యం!

సంపాదకుడు : విశ్వం





పువ్వు పుట్టగానే...

# అపూర్వ కరుణ!



వీధిలో బిచ్చగాడు కనిపిస్తే, 'అయ్యోపాపం' అనుకుని జేబులో చిల్లర డబ్బులు తీసి వేస్తాం. ఆ తరవాత దానిని గురించి మరిచిపోతాం. అంతే కదా? అయితే, ఒక ఆరేళ్ళ కుర్రాడు ఒక బిచ్చగాణ్ణి చూసి ఏంచేశాడో చూడండి:

ఇటలీలోని ఒక నగరంలో ఆ కుర్రాడు వాడి తల్లితో కలిసి నడిచి వెళుతున్నాడు. చిరిగిన బట్టలతో ఒక బిచ్చగాడు బిచ్చమెత్తుకోవడం వాడి కంటబడింది. అలాంటి దృశ్యాన్ని ఆ పసివాడు అంతకు ముందెన్నడూ చూడలేదు. వెంటనే పరిగెత్తుకుపోయి తన చేతులతో ఆ బిచ్చగాణ్ణి కావిలించుకున్నాడు. ఆ తరవాత అతడి స్థితికి జాలిపడి ఆ బిచ్చగాడికి డబ్బులివ్వమని తల్లిని వేడుకున్నాడు.

బిచ్చకాడు, పిల్లవాడి చల్లని మనసును చూసి, కన్నీళ్ళపర్యంతమైపోయి, ఆ తల్లితో, ''అమ్మా, మీ బిడ్డ మామూలు బిడ్డ కాదు; మహాత్ముడు. అతడు పెరిగి పెద్దవాడై, దేశానికి ప్రజలకు ఎన్నో మంచిపనులు చేయగలడు. అతన్ని జాగ్రత్తగా చూసుకో తల్లీ,'' అన్నాడు.

ఆ బిచ్చగాడి మాటలు అక్షరాలా నిజమయ్యాయి. ఆ పసివాడు పెరిగి పెద్దయ్యాక కరుణామూర్తిగా పేరుగాంచాడు. పేదప్రజల దైన్యస్థితిని మార్చడానికి ఎంతగానో కృషిచేశాడు.

ఆయన గొప్ప దేశభక్తుడిగా కూడా పేరుతెచ్చుకున్నాడు. తన హృదయాన్ని తెరిచిచూస్తే, అందులో 'ఇటలీ' అని రాసివుంటుంది అని అతడు తరచూ గొప్పగా చెప్పుకునేవాడు. ఆయన జీవితాన్నే తన దేశం కోసం త్యాగం చేశాడు. ఆయన మరెవరోకాదు. ఇటలీకి చెందిన సుప్రసిద్ధ దేశభక్తుడు జోసెఫ్ మాజినీ.



# నత్కీరుడి చమత్కారం

చింతాపురంలో నత్కీరుడనే మహాపండితు డుండేవాడు. ఆయన ఎంతటి క్లిష్టమైన విషయాన్నయినా, అరటిపండు వలిచినట్లు చెప్పగలడని పేరు. చమత్కారంగా మాట్లాడ డంలో, ఆయనకున్న ప్రజ్ఞ గురించి గ్రామ స్థులు కథలు కథలుగా చెప్పుకుంటారు. సకలశాస్త్ర పారంగతుడైనా, వినయంలోనూ తనకుతనే సాటి అయిన నత్కీరుడంటే గ్రామస్థులందరికీ ఎంతో గౌరవం.

ఇలావుండగా, ఆ ఊరుకు కొత్తగా కీర్తికాముకుడనే భాగ్యవంతుడువచ్చాడు. తనకురాని విద్యలేదని ఆయనకు మిడిసి పాటు. తన గురించిన పొగడ్తలువివడం, ఆయనకు ఎంతో ఇష్టం. అందుకోసం ఆయన డబ్బు ఖర్చుచేయడానికి కూడా వెనుకాడడు. పట్నంలో తనెవరూ పట్టించు కోవడంలేదని, ఆయన తన నివాసం పల్లెటూరికి మార్చాడు. అక్కడే లంకంత ఇల్లూ, వందెకరాల మాగాణీ కొన్నాడు.

కీర్తికాముకుడి గురించి తెలుసుకున్న కొందరు స్వార్థపరులు ఆయనచుట్టూచేరారు. నిత్యం ఆయనను పొగడ్తలతో ముంచెత్తుతూ తమ అవసరాలకు డబ్బు సంపాదించు కోవడం వృత్తిగా చేసుకున్నారు. దాంతో కీర్తికాముకుడికి చింతాపురం విపరీతంగా నచ్చేసింది. అక్కడ ఆయనకు రోజులు సంతోషంగా గడిచిపోతున్నాయి.

కీర్తికాముకుడి భార్య సునగరి పట్నంలో పుట్టిపెరిగింది. ఆమెకు పల్లెటూరునచ్చలేదు. అటుపైన, భర్త పొగడ్తల కోసం చేస్తున్న వృథాఖర్చులు, ఆమెను మరింతగా కలవర పెట్టాయి. అందుకని ఆమె, పట్నంలోవున్న తన తమ్ముడు శుభాకరుడికి వెంటనే బయ ల్దేరిరావలసిందిగా కబురుపెట్టింది.

ఆ ప్రకారం చింతాపురం వచ్చిన శుభా కరుడు త్వరలోనే అక్కడి పరిస్థితి ఆకళింపు చేసుకున్నాడు. వయసులో తనకంటే పెద్ద వాడైన బావగారిని మందలించడం బాగుండ

"వసుంధర"

దని, ఆయనకు నచ్చచెప్పే ఉపాయం కోసం ఎంతగానో ఆలోచించాడు. చివరకు ఆయనను పొగడ్తలతోనే గెలవాలనుకుని, ఒకరోజున ఆయనతో, "బావా! ఏ దేశానికైనా గ్రామాలే పట్టుగొమ్మలు. గ్రామంలో స్థిర పడాలన్న నీ నిర్ణయాన్ని నేను మెచ్చుకో కుండావుండలేకపోతున్నాను. ఐతే, వ్యవ సాయంలోకంటె వ్యాపారంలో అగ్రగణ్యు డివి గాబట్టి, నీవు పట్నానికి తిరిగివెళ్ళి వ్యాపారం కొనసాగించి, మన కుటుంబానికి మంచి లాభాల నార్జించి పెట్టవలసిందిగా, నిన్ను వేడుకుంటున్నాను. నీ ఆశయసాధన కోసం నేను చింతాపురంలో స్థిరపడి వ్యవ సాయం చేస్తూంటాను," అన్నాడు.

దీనికి కీర్తికాముకుడు ఏమాత్రము అంగీకరించలేదు. ఆయన శుభాకరుడితో, "ఇక్కడ నాకు అపారమైన గౌరవం లభిస్తు న్నది. డబ్బు ఎంతసంపాదించినా, పట్నంలో ఇలాంటి గౌరవం మాత్రం దొరకదు. నాకిక్కడే బాగుంది," అని ఖచ్చితంగా చెప్పేశాడు.

ఈ సమాధానం శుభాకరుడు ఊహించ లేనిదేమీకాదు. ఆ కారణంగా అతడు ఏ మాత్రమూ తొణకక, "బావా! గ్రామాల్లో ప్రజలు డబ్బుకు ప్రాముఖ్యాన్నివ్వరు. వారు ప్రతిభకు మాత్రమే పట్టంకడతారు. డబ్బు పుచ్చుకోకుండానే ప్రతిభావంతులైన కవులను, పండితులను, ఇతర కళాకారులను వారు అభిమానించి గౌరవిస్తారు. అలాంటి గౌరవం నత్కీరుడికి ఈఊళ్ళో లభిస్తున్నది. ఇక్కడ నిన్ను పొగిడేవారందరూ, డబ్బు కోసమే పొగుడుతున్నారు!" అంటూ చురక కూడా వేశాడు.



ఈ మాటలు కీర్తికాముకుడిలో పౌరుషాన్ని లేపాయి. అంతవరకూ నత్కీరుడంటే ఆయ నకూ గౌరవంవుంది. గ్రామస్థుల గౌరవం విషయంలో నత్కీరుడు తనకు పోటీదారని తెలియగానే, "డబ్బుతో ఎక్కడైనా ఏమైనా చేయవచ్చు. ఆ నత్కీరుడి చేతనే, నావంటి వాడు లేడనిపించుకుంటాను, చూడు!" అంటూ ఆయన, శుభాకరుడి వద్ద ప్రతిజ్ఞ లాంటిది చేశాడు.

తర్వాత ఆయన, "నేను మిమ్మల్ని డబ్బుతో సన్మానించాలనుకుంటున్నాను," అని నత్కీరుడికి కబురుపంపాడు.

"సన్మానం దేనికి?" అని నత్కీరుడు బదులు ప్రశ్నపంపాడు.

ఇలా జరుగుతుందని ఊహించని కీర్తికాముకుడు, "సన్మానిస్తానంటే, దేనికని అడిగే ఈ నత్కీరుడు అహంకారి అయుం



డాలి లేదా పరమ మూర్ఖుడైనా కావాలి. ఇలాంటివాడని తెలియక, ఈ గ్రామస్థులు ఆయనను గౌరవించి, తమను తాము తక్కువ చేసుకుంటున్నారు. ఈ విషయం బయటపెట్టి, ఇక్కడ నా కీర్తి ప్రతిష్ఠలు మరింతగా పెంచుకుంటాను,'' అని తిరస్కారంగా శుభాకరుడితో అన్నాడు.

''బావా! అహంకారం, మూర్ఖత్వం నీవి. నీవు ఆయనను స్వయంగా కలుసుకో, ఆయనను సన్మానించడానికి, నీకున్న అర్హతలు నిరూపించుకో,'' అంటూ శుభాకరుడా యనను మందలించాడు.

ఈ విధంగా, కీర్తికాముకుడు నత్కీరుడి ఇంటికి వెళ్ళాడు.

ఇంటికి వచ్చిన ఆయనను నత్కీరుడు ఎంతో అభిమానంగా ఆదరించి మర్యాదలు జరిపి వచ్చినపని అడిగాడు.

''ప్రతిభకు పట్టంకట్టడానికి ప్రతిభేవుండ నవసరంలేదు. ప్రతిభావంతులను గౌరవించే సహృదయం నాకున్నది. మీకు సన్మానం చేయాలని, నాకోరిక. మీరు కాదన కూడదు,'' అంటూ వచ్చినపని చెప్పాడు కీర్తికాముకుడు.

''మీ ఆశయం మెచ్చుకోతగ్గది. అయితే, నాకున్న కాస్త ప్రతిభా పాండిత్యంలో మాత్రమే వున్నది. నన్ను సన్మానించేవారు పండితులైతేనే, నాకు సంతోషం. నా పాండిత్యంలో మీకు నచ్చిన అంశాలు చెప్పండి!'' అన్నాడు నత్కీరుడు ఎంతో వినయంగా.

కీర్తికాముకుడు, ఈ మాటలకు మనసులో నొచ్చుకున్నా బయటపడకుండా, ''ఆర్యా! కారణం గురించి మీకు మరీ అంత పట్టింపు వుంటే, తమరు నాగురించి నలుగురికి గొప్పగా చెప్పండి. కవులు, పండితులు తమకు సన్మానంచేసిన వారినిపొగిడే సంప్రదాయం పూర్వం నుంచీవస్తున్నదేకదా!'' అన్నాడు.

''సన్మానంకోసం కాకపోయినా నేను మిమ్మల్ని పొగడ గలను. ఏ అంశం చెప్పి మిమ్మల్ని పొగిడేది? ఏ అంశమూ లేదను కున్నా, కనీసం నాపొగడ్తవల్ల ఏమైనా ప్రయోజన ముండాలి కదా?'' అని అడిగాడు నత్కీరుడు.

''పొగడ్తకింతగా ఆలోచించాలా? పట్నంలో వ్యాపారంలో ఎంతగానో రాణిస్తున్న నేను, నా సంపాదనను త్యాగంచేసి పల్లెటూరు వచ్చాను. అదే నా గొప్పతనం!'' అన్నాడు కీర్తికాముకుడు.

''పొగడ్తలకోసమే ఇక్కడుండాలనుకునే వారివల్ల, ఈ గ్రామానికి ప్రయోజనం వుండదని నా అభిప్రాయం. మనిద్దరం ఒకరినొకరు పొగడుకునే ఆలోచన మంచిది

కాదు," అని నత్కీరుడు నిష్కర్షగా చెప్పి, కీర్తికాముకుణ్ణి పంపేశాడు.

కీర్తికాముకుడికి చాలాకోపం వచ్చింది. అప్పటినుంచీ ఆయన నత్కీరుడి మీద దుష్ప్రచారంచేయించసాగాడు. డబ్బుకాశ పడి కొందరు గ్రామస్థులు, నత్కీరుడు అహం కారి అనీ, సన్మానం చేస్తానన్న కీర్తికాము కుణ్ణి అవమానించి పంపాడనీ, గ్రామంలో అందరికీ చెప్పసాగారు. ఆ మాటలుకొందరు నమ్మారు, కొందరు నమ్మలేదు. నత్కీరుడు మాత్రం ఈ ప్రచారాన్ని బొత్తిగాపట్టించుకోలేదు.

అయితే, వారం రోజులుగడిచే సరికి, నత్కీరుడికిచెరువుకుస్నానానికిపోయినప్పుడు మెట్లమీద కాలుజారి పడడంతో, కాలు దెబ్బతిని పదిరోజుల పాటు మంచం మీద వుండవలసివచ్చింది.

కీర్తికాముకుడు పరమ సంతోషంతో దీనిని చక్కని అవకాశంగా తీసుకుని, " నేను అన్నీ మంచిపనులే చేస్తాను కాబట్టి, నాకు దైవానుగ్రహంవుంది. నా పట్లతప్పుగా ప్రవ ర్తించినవారిని భగవంతుడు శిక్షిస్తూంటాడు. నత్కీరుడి విషయంలో ఇప్పుడు జరిగిందదే!" అంటూ తన అనుచరుల ద్వారా మళ్ళీ ప్రచారంచేయించాడు.

దీనికి నత్కీరుడు నొచ్చుకున్నాడు. ఆయన గ్రామాధికారిని కలుసుకుని, "నేను అహంకారినని ప్రచారం జరిగితే పట్టించు కోలేదు. ఎందుకంటే, నా గురించి ఎవరిష్టం వచ్చినట్లు వారనుకోవచ్చు. కానీ నాకు జరి గిన ప్రమాదం భగవంతుడు నా కిచ్చిన శిక్ష అంటే మాత్రం నేనొప్పుకోను. నేను తప్పు చేసిందీ లేనిదీ విచారణచేసి నిర్ణయించ



వలసిందిగా, మిమ్మల్ని వేడుకుంటున్నాను,'' అన్నాడు.

నత్కీరుడంటే గౌరవమున్న గ్రామాధికారి వెంటనే, ఈ విషయమై విచారణ ప్రారంభిం చాడు. విచారణ గ్రామదేవత ఆలయం ముందు జరుగుతుంది. సాక్ష్యంచెప్పేవాళ్ళు నిజంచెబుతున్నారా, లేదా అన్నది గ్రామ దేవత, తన పూజారినోట పలికిస్తుందన్నది గ్రామస్థుల నమ్మకం. అందువల్ల, నత్కీరుడు, కీర్తికాముకుణ్ణి అవమానించాడని అబద్ధం చెప్పడానికి ఒక్కరు కూడా ముందుకు రాలేదు.

కీర్తికాముకుడు కూడా, ''నాపట్ల తప్పు చేసినవారికి కీడు జరుగుతుందనడానికి, ఇప్పటి వరకూ ఎన్నో నిదర్శనాలున్నాయి. నత్కీరుడికి చెరువుదగ్గర ప్రమాదం జరగ డంతో, నా పట్ల తప్పుచేసివుంటాడని నేను నమ్మాను. పాపపుణ్యాలు ఆ భగవంతు డికెరుక!'' అని తప్పించుకోజూశాడు.

దానితో గ్రామాధికారి విషయాన్ని చూచాయగా ఆకళింపు చేసుకోగలిగాడు. అందుకని, ఆయన కీర్తికాముకుడితో, ''మీ మాటల్లో ఎంతనిజమున్నదీ తెలుసుకు నేందుకు కూడా గ్రామదేవత సాయాన్నికోర వలసివుంటుంది!'' అన్నాడు.

అయితే, నత్కీరుడు వెంటనే, ''కీర్తికాము కుడి మాటల్లో నిజమున్నదని, నేనూ నమ్ముతున్నాను. ఆయన ఎంతగా అడి గినా, నేను పొగడకపోవడమేకాక, ఆ సంగతి పదిమందికీ చెప్పకపోవడమే, నేను చేసిన తప్పయివుండవచ్చు. అందుకే భగవంతుడు నన్ను శిక్షించి వుంటాడని, నేనూ నమ్ముతు న్నాను! ఇక గ్రామదేవతను అర్థించవలసిన అవసరమేముంది?'' అన్నాడు.

ఈ మాటలకు గ్రామాధికారితో సహా అక్కడున్న వారందరూ ఫక్కున నవ్వారు. కీర్తికాముకుడికి చచ్చేటంత అవమాన మయింది. ప్రతిభావంతులతో గొడవ పెట్టుకోవద్దని బావమరిది చేసిన హెచ్చరిక చెవినిపెట్టనందుకాయన పశ్చాత్తాపపడి, వ్యవసాయాన్ని శుభాకరుడికి అప్పచెప్పి, తను తిరిగి పట్నం వెళ్ళిపోయాడు.

అయితే, చింతాపురం గ్రామస్థులు తర చుగా చెప్పుకునే, నత్కీరుడి చమత్కారం గురించిన కథల్లో మాత్రం, ఆయన శాశ్వ తస్థానాన్ని సంపాదించుకున్నాడు.





# భల్లూక మాంత్రికుడు

## 4

*[జలపాతం వెనక నుంచి వచ్చిన భల్లూకమాంత్రికుడు, కాళీవర్మ సాహసాన్ని గొప్పగా మెచ్చుకున్నాడు. ఆ సమయంలో అక్కడికి జితకేతరాజు మంత్రి భటులతో వచ్చాడు. మాంత్రికుడు, అతణ్ణి హడలగొట్టి, తలారి ఎనుబోతు మీద ఎక్కించి, అందరినీ వెంటనే నగరానికి బయలుదేరమని ఆజ్ఞాపించాడు. అది సహించని కాళీవర్మ కోపంకొద్దీ మాంత్రికుడిపై కత్తిదూశాడు. తరవాత-]*

భల్లూకమాంత్రికుడు ఒక క్షణకాలం కాళీవర్మ మాటలకు నివ్వెరపోయి, అక్కడ వున్న వాళ్ళందరి కేసీ పరీక్షగా చూశాడు. మంత్రి జీవగుప్తుడు తప్ప, మిగతా వాళ్ళందరూ ఇంకా భయకంపితులయ్యేవున్నారు. జీవగుప్తుడు తానెక్కివున్న ఎనుబోతును అదిలించి కాళీవర్మను సమీపించబోతున్నంతలో, భల్లూకమాంత్రికుడు, అతణ్ణి ఆపి, "ఓయీ, మంత్రీ! ఇప్పుడు నువ్వు వేయబోతున్న పథకం ఏమిటి? కాళీవర్మను నా మీదికి ఉసికొల్ప జూస్తున్నావా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నతో మంత్రి జీవగుప్తుడు వెలవెల పోతూ, "అయ్యా, భల్లూకమాంత్రికా! తమ లాంటి మహామాంత్రికుల ఆజ్ఞల్ని శిరసావహించటం క్షేమమని, నేనీ యువకుడికి చెప్ప బోతున్నాను," అన్నాడు.

ఆ జవాబుకు భల్లూకమాంత్రికుడు చిన్నగా నవ్వి, "నువ్వనే యువకుడు కాళీవర్మే త్వరలో మీ అందరికీ ఆజ్ఞలివ్వబోతున్నాడు, జాగ్రత్త!" అని, ఇంకా కత్తి దూసి కోపంగా తన కేసి చూస్తున్న కాళీవర్మతో, "కాళీవర్మా, తొందర పడకు! నీవు అంతగా జీవితానుభవంలేని



వాడివి. ఇప్పటి స్థితిలో నీ దారిన నువ్వూ, నాదారిన నేనూ వెళ్ళిపోతే, ఆ తరవాత జరగ నున్నదేమిటో ఆలోచించావా?'' అన్నాడు.

''దాన్నిగురించి అంతగా ఆలోచించ వలసిందేమీలేదు. నువ్వు తిరిగి జలపాతం వెనకవున్న గుహలోకిపోతావు; నేను మా గ్రామం చేరి వ్యవసాయం చేసుకుంటూ ప్రశాంతంగా జీవితం సాగిస్తాను,'' అన్నాడు కాళీవర్మ.

''నువ్వెంత గొప్ప ధైర్యశాలివో, అంత అమాయకుడివన్నమాట!'' అని భల్లూక మాంత్రికుడు మంత్రి జీవగుప్తుడితో, ''ఓయీ, మంత్రీ! కాళీవర్మ తన గ్రామం చేరింతరవాత, అతణ్ణి పట్టి తెచ్చేందుకు ఎంతమంది సైనికుల్ని పంపాలని రాజుకు సలహా ఇవ్వ బోతున్నావో దాచకుండా చెప్పు? నీ మనసులో మెదిలే ఆలోచనలు నేను స్పష్టంగా గ్రహిం చగలను. అబద్ధం ఆడావో నిన్నిక్కడే, ఈ క్షణమే ఆ కాలిన ఎండు మానులా నిలువునా భస్మం చేయగలను,'' అంటూ మంత్రదండం పైకెత్తాడు.

జీవగుప్తుడు ప్రాణభయంతో వణికి పోతూ, ''నా ఆలోచనలేవో తమరు పసిగట్టారు గనక, నేను దాచి ప్రయోజనం లేదు. జితకేత రాజుగారి ఉప్పు తింటున్న నేను, ఆయన క్షేమం కోరి, ఆ కాళీవర్మను హతమార్చాలని సలహా ఇవ్వక తప్పదు గదా?'' అన్నాడు.

భల్లూకమాంత్రికుడు మంత్రదండాన్ని గట్టిగా నేలకు తాటించి, ''విన్నావా, కాళీ? ఇక నీకీ చంద్రశిలానగర రాజ్యంలో భద్రత లేదు,'' అన్నాడు.

కాళీవర్మకు ఆ మాటలతో తన విషమ స్థితి అర్థమైపోయింది. అంత గొప్ప సైన్యం గల జితకేతరాజును తాను ఒంటరిగా గాని లేక కొంతమంది అనుచరుల సహాయంతో గాని ఎదిరించి నిలబడటం దుర్లభం. జిత కేతుడి సింహాసనాన్ని తాను ఆక్రమించు కోగలగటమో, అది సాధ్యం కాకపోతే దేశం విడిచి పోవటమో తాను చేయవలసి వున్నది .....

కాళీవర్మ ఇలా ఆలోచిస్తూ, కత్తిని ఒరలో పెట్టి, భల్లూకమాంత్రికుడితో, ''గురూ, తమరు చెప్పింది నిజం! నా క్షేమం సంగతి నా కన్న, నన్ను పెంచి పెద్ద చేసిన బలభద్రు డనే నౌకరుకూ, మీకూ ఎక్కువ తెలిసినట్టు న్నది. ఇప్పుడేం ఆజ్ఞ!'' అన్నాడు.

భల్లూకమాంత్రికుడు, తనమంత్రదండంతో కాళీవర్మ భుజాన్ని తాకి, ''కాళీ, నీ అదృష్ట దేవతే నిన్ను ప్రోత్సహించి, నన్ను గురు వుగా సంబోధించమని చెప్పింది, భేష్! నీకు నేనిచ్చేవి ఆజ్ఞలు కావు, సలహాలు! ఇప్పుడు మనమందరం నగరానికి పోతున్నాం. ఆ

జితకేతరాజు దర్పం ఏపాటిదో చూడాలి. ఓయీ, మంత్రి జీవగుప్తా! నేను ఆ ఎనుబోతు వాహనాన్ని అధిరోహించబోతున్నాను. నువ్వు ముందుండి, దాని ముక్కుతాళ్ళు పట్టుకుని నగరం కేసి దారి తియ్యి,'' అన్నాడు.

మంత్రి జీవగుప్తుడు మారుమాట్లాడకుండా ఎనుబోతు మీదినుంచి దిగి, దాని తాళ్ళు పట్టుకున్నాడు. భల్లూకమాంత్రికుడు ఎనుబోతు మీదకూర్చుని, చుట్టూ వున్న వాళ్ళ కేసి ఓమారు చూసి, ''ఈ ఎనుబోతు చాలా కాలం కిందట, ఈ లోకంలో దారి తప్పిన ఒక యమకింకరుడి వాహనం. ఈ మాట నమ్మని వాళ్ళు మీలో ఎవరైనా వున్నారా?'' అని అడిగాడు.

ఎవరూ ఆ మాట కాదనలేదు గాని, తలారి మాత్రం ఏదో గొణుక్కున్నాడు.

భల్లూకమాంత్రికుడు తన మంత్రదండాన్ని ఎనుబోతు తలమీద ఒకసారి తాకించి, ''కింకరా! క్షుద్రమానవుడి చేతబడి, పుట్టుకతో అబ్బిన అపూర్వ శక్తులు పోగొట్టుకున్నానని సంశయిస్తున్నావా? అదేం లేదు. ఏదీ, భూమి మీది నుంచి ఒకటి రెండు గజాల ఎత్తున గాలిలోకి లేచి, నగరం కేసి కొద్ది దూరం ప్రయాణం చెయ్యి,'' అన్నాడు.

ఆ వెంటనే ఎనుబోతు ముక్కుపుటాల నుంచి బుస్సుమంటూ తుఫాను వేగంతో గాలి వదిలి, తల పైకెత్తి కర్ణకఠోరంగా అరిచి, నేలమీది నుంచి అలవోకగా గాలిలోకి లేచి, నగరం కేసి బయలుదేరింది. ఎనుబోతు అలా పైకి లేచే సమయంలో దాని ముక్కు తాళ్లను జారవిడిచిన మంత్రి జీవగుప్తుడు, పడుతూ లేస్తూ దాని కేసి పరిగెత్తసాగాడు.



భల్లూకమాంత్రికుడు కొంతదూరం పోయి ఎనుబోతును నేలకు దించి మంత్రి దాని తాళ్ళు పట్టుకోగానే, వెనక వస్తున్న వాళ్ళ కేసి చూసి, ''ఎంతటి మహామంత్రికి, ఎలాంటిదుర్గతిపట్టిందో చూశారా?'' అన్నాడు.

అప్పటివరకూ ఈ జరిగినదానినంతా మౌనంగా చూస్తూ గుర్రంమీద కూర్చుని వున్న కాళీవర్మ, మాంత్రికుణ్ణి సమీపించి, ''మిమ్మల్ని నేను గురువుగా భావిస్తున్నాను. అట్లని నాకు ఇష్టంలేని ఆజ్ఞలన్నిటికీ తల ఒగ్గుతాననుకోకండి, మీరు నిజంగానే ఆ దుష్టుడైన జితకేతరాజును శిక్షించబోతున్నారా?'' అని అడిగాడు.

''గురుశిష్యులన్న తరవాత, గురువు, శిష్యుడికి మేలు చేకూర్చే ఆజ్ఞలే ఇస్తాడు. అది సరే, నీకు జితకేతరాజు సింహాసనం ఆక్రమించాలని వున్నదా?'' అని అడిగాడు భల్లూకమాంత్రికుడు.



''నాకు అలాంటి దురాశ లేదు. నేను కోరేదల్లా ఆ రాజు నిర్దోషుల్ని శిరశ్ఛేదం లాంటి అమానుష శిక్షలకు పాలుచేయకుండా వుండటం,'' అన్నాడు కాళీవర్మ.

''ప్రయత్నించి చూస్తాను, కాళీ! కాని, పుట్టుకతోనే సింహాసనానికి వారసులయ్యే జితకేతరాజులాంటివాళ్ళు, ఒక పట్టాన మారరు. అవునా, మంత్రీ?'' అన్నాడు భల్లూక మాంత్రికుడు.

''మహాగొప్పగా సెలవిచ్చారు, మాంత్రి కులు!'' అన్నాడు మంత్రి జీవగుప్తుడు.

తరవాత అందరూ నగరం కేసి కొంత దూరం ప్రయాణించాక, ఇద్దరు అశ్వికులు వేగంగా వాళ్ళ ముందుకు వచ్చి, దారిని అటకాయిస్తూ, ''ఎనుబోతు మీద సన్యాసిని ఎక్కించి, పట్టుదుస్తులూ, చెవికి బంగారు కుండలాలూ ధరించిన మనిషి, ముందుండి దారి తీయడమేమిటి? ఆ నల్లగుడ్డలతో, పిశాచిలాగావున్నవాడు పంచకళ్యాణి లాంటి అద్భుతమైన గుర్రం ఎక్కి సవారీ చేయ టమా? ఎవరు మీరు?'' అన్నారు పళ్ళు కొరుకుతూ.

భల్లూకమాంత్రికుడు పెద్దగా నవ్వి, అశ్వి కులతో, ''మీరు జితకేత రాజు సైనికులు కాదన్నమాట; అందువల్లే మమ్మల్ని పోల్చుకో లేకపోయారు. మేం ఎవరమో మరిచిపోయి, ఆ సంగతి తెలుసుకునేందుకు ఆ కనబడే నగరం పోతున్నాం,'' అన్నాడు.

''ఈ వేళాకోళం మాటలు కట్టిపెట్టు. మేం ఎవరమో తెలుసా? ఉదయగిరి రాజైన దుర్ముఖుడి సైనికులం. ఇప్పుడే దిరిసెనవనం లోకి పోయి వస్తున్నాం. అక్కడ కాళీవర్మ అనేవాడు గాని, వాడి శవంగాని కనిపించ లేదు. అన్న మాట తప్పినందుకు జితకేత రాజు మీదికి, మా రాజుగారు దాడి రాబోతు న్నారు,'' అన్నారు దుర్ముఖుడి అశ్వికులు.

''అయితే, ఈ సంగతులన్నీ మాకు మనవి చేయటమెందుకు? ఇక దారి తొలిగి, మీ దారినమీరుపొండి,'' అన్నాడు భల్లూకమాంత్రి కుడు కోపంగా.

అంతలో దుర్ముఖుడి అశ్వికుల్లో ఒకడు తలారి కేసి ఆశ్చర్యంగా చూస్తూ, ''నువ్వు దిరిసెన చెట్ల తోపులో వుండే జితకేతరాజు తలారివి కాదా?'' అన్నాడు హేళనచేస్తున్నట్టు వికవికమని నవ్వుతూ.

అప్పటికే తానేదో నలుగురిలో నవ్వుల పాలయ్యానని బాధపడుతున్న తలారి పళ్లు కొరుకుతూ గండ్రగొడ్డలిని పైకెత్తి, ''ఒరే, పొగరుబోతా! నేనెవరైనదీ తెలిసీ అవహేళన చేస్తున్నావా? అదుగో, ఆగుర్రం మీదవున్న.

పెడతల శవాన్ని చూశావా? నీకూ ఆ గతి పట్టిస్తాను,'' అన్నాడు.

ఆ జవాబు విని కాళీవర్మ ఉత్సాహం కొద్దీగుర్రాన్ని తలారి దగ్గిరకు పరిగెత్తించి, కత్తితో అతడి భుజాన్ని తట్టి, ''కుక్క కాటుకు చెప్పుదెబ్బలాంటి జవాబిచ్చావు, తలారీ! పనిలో పనిగా ఈ దుర్ముఖుడి అశ్వికుల తలలు నరుకుతావా ఏం!'' అని అడిగాడు.

''అంతా భల్లూకమాంత్రికుల దయ! వారు ఆజ్ఞాపిస్తే, అంతపనీ చేయాలని వున్నది,'' అన్నాడు తలారి.

అంతలో దుర్ముఖుడి అశ్వికుల్లో ఒకడు గట్టిగా గుర్రాన్ని అదిలించి, పెద్దగా కేక పెడుతూ, ''వీళ్ళెవరో నరమాంస భక్షకులు! మనిషిని చంపి, శవాన్ని పెడముఖంగా గుర్రం మీదకట్టి, నగరానికి తీసుకుపోతున్నారు,'' అన్నాడు.

భల్లూకమాంత్రికుడు ఛీత్కరిస్తూ ఆ ఇద్దరు అశ్వికుల కేసీ ఓమారు చూసి కాళీవర్మతో, ''కాళీ! ఈ చచ్చువెధవల వెకిలి వాగుడు మరెంతసేపు భరించేట్టు!'' అన్నాడు.

వెంటనే కాళీవర్మ కత్తిదూసి, ''ఒరే, దుర్ముఖుడి సేవకుల్లారా, మర్యాదగా మీ దారిని మీరు పోతారా, తలలు నరికించుకుంటారా?'' అన్నాడు.

ఆ వెంటనే మంత్రి జీవగుప్తుడి వెంట వచ్చిన అశ్వికులిద్దరూ డాళ్ళు పైకెత్తి, కత్తులు దూసి, దుర్ముఖుడి అశ్వికుల కేసి తమ గుర్రాలను దూకిస్తూ, ''ఆ పని మాకు వదలండి. ఈ పొగరుబోతులు చాలా అవమానకరంగా మాట్లాడుతున్నారు,'' అంటూ వాళ్లమీద పడ్డారు.



దుర్ముఖుడి అశ్వికులు కూడా కత్తులు దూసి ఆత్మరక్షణ చేసుకుంటూ, తమ గుర్రాలను అదిలించి పారిపోతూ, ''దుర్ముఖ మహారాజుగారు, ఈ దాపులనున్న మామిడి తోటలోనే గుడారాలు వేసుకుని వున్నారు. క్షణాల మీద ఆయన వచ్చి, మీ అందర్నీ చిత్రవధ చేయించగలడు,'' అంటూ కేకలు పెట్టారు.

జీవగుప్తుడి అశ్వికులిద్దరూ, శత్రుఅశ్వికుల్ని చాలా దూరం తరుముకుంటూ పోయి, వాళ్ళు ఎంతకూ తమ కత్తి దెబ్బలకు అందకపోవటంతో, తిరిగి వచ్చారు.

అంతలో జీవగుప్తుడి భటులలో ఒకడు, పక్కకు చూస్తూ, ''అయ్యా, ఈ సారి పదిమంది శత్రుఅశ్వికులు మన మీదికొస్తున్నారు!'' అంటూ అరిచాడు.

వాడు అన్నట్టు నిజంగానే పదిమంది దుర్ముఖుడిఅశ్వికులు వాళ్ళనుసమీపించారు.

కాని, వాళ్ళు కత్తులు దూసి కలియబడక, కొంచెం దూరంలోనే ఆగారు. వాళ్ళలో ఒకడు దుస్తుల్లోనుంచి ఒక పొడవాటి పత్రాన్ని తీసి పెద్దగొంతుతో ఇలా చదివాడు: "ఇక్కడవున్న వాళ్ళందరూ, మామిడితోటలో విడిది చేసివున్న దుర్ముఖ మహారాజుగారి సముఖానికి రావాలి, ఇది రాజాజ్ఞ!"

అది వింటూనే అందరూ విస్తుపోయి చూసేంతలో భల్లూకమాంత్రికుడు తను ఎక్కివున్న ఎనుబోతును దుర్ముఖుడి ఆశ్వికుల కేసి తిప్పమని మంత్రి జీవగుప్తుణ్ణి ఆజ్ఞాపించి, దుర్ముఖుడి ఆశ్వికులతో, "దుర్ముఖుడంతటివాడు ఆజ్ఞాపిస్తే, ఇక చేయగలిగిందేమిటి? అతడున్న మామిడితోటకు దారి తీయండి," అన్నాడు.

"గురూ, ఏమిటిది?" అన్నాడు కాళీవర్మ ఆశ్చర్యపోతూ.

"స్వయంగా నువ్వే చూద్దువు గాని," అన్నాడు భల్లూకమాంత్రికుడు.

దుర్ముఖుడి ఆశ్వికులు వాళ్ళను సరాసరి వాళ్ళ రాజున్న మామిడితోటకు తీసుకుపోయారు. రాజు దుర్ముఖుడు ఒక ఎత్తయిన ఆసనం మీద కూర్చుని వున్నాడు. దానికి అటూ ఇటూ ఇద్దరు ఖడ్గధారులూ, కొంచెం ఎడంగా మంత్రులూ, సలహాదారులూ తలలు వంచుకుని నిలబడివున్నారు.

భల్లూకమాంత్రికుణ్ణీ, అతడి వెంటవున్న వాళ్ళనూ చూస్తూనే దుర్ముఖుడు కళ్ళెర్రచేసి, "ఒరే, దుష్టులారా! తలారితో ప్రారంభించి మీ అందరి తలలూ నరికించబోతున్నాను. ఆఖరి వంతు కాళీవర్మ అనేవాడిది," అన్నాడు.

దుర్ముఖుడు ఇలా అనగానే భల్లూకమాంత్రికుడు, "ఆదిభల్లూకా!" అంటూ ఒక కేకపెట్టి, ఎనుబోతు మీది నుంచి దిగి, ప్రాణభయంతో గడగడ వణుకుతున్న తలారితో, "ఒరే, తలారీ! నీ తల దుర్ముఖుడు నరుకుతాడో, లేక వాడి తల నువ్వు నరుకుతావో, ఈ క్షణంలోనే తేలిపోతుంది," అంటూ మంత్రదండం చివరనున్న భల్లూక తలాటంతో, వాడి వెన్నును తాకాడు.

ఆ మరుక్షణం తలారి నల్లని భల్లూకాకారంతో గండ్రగొడ్డలిని గిర్రున తిప్పుతూ, గుర్రం మీది నుంచి కుప్పించి దూకి, భీకరంగా అరుస్తూ, రాజు దుర్ముఖుడి కేసి పరిగెత్తాడు. - (ఇంకా వుంది)



బేతాళ కథలు

# అనంతుడి కోరిక

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్నిదించి భుజానవేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, విద్యాధికుడివైన నువ్వు, భీతిగొల్పే ఈ శ్మశానంలో, నిశిరాత్రి వేళ ఇన్నికష్టాలను సహిస్తున్నావంటే నమ్మశక్యం కాకుండావున్నది. ఇంతకూ, దీనికికారకులు, నీ మంచితనాన్ని తమ స్వార్థంకోసం ఉపయోగించుకుంటున్న కుత్సిత మనస్కులై వుండాలి. అలాంటివాళ్ళవలలో చిక్కి, కార్యసాధన తర్వాత అవివేకం కొద్దీ తనమేలును కూడా మరచిన అనంతుడనే యువకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:



పూర్వం మందారకమనే దేశాన్ని సత్కీరుడనే రాజు పాలిస్తూండేవాడు. విరజుడు, సత్కీరుడి ఒక్కగానొక్క కొడుకు. అతడికి కాస్త వయసురాగానే రాజు, అతణ్ణి గోబిలుడనే గురువు నడిపే గురుకులానికి పంపించాడు.

గురుకులంలో మొత్తం పదిమంది విద్యార్థులుండేవారు. వారిలో ఒక్క అనంతుడనే విద్యార్థి తప్ప మిగిలినవారందరూ, విరజుడు రాజకుమారుడనే భయభక్తులతో కొంచెం ఎడంగామసిలేవారు. అయితే, అనంతుడు మాత్రం మొదటి రోజునే విరజుణ్ణి ఆదరంగా పలకరించి స్నేహం కలుపుకున్నాడు. శాంతంగా, ఆత్మీయంగా ప్రవర్తించే అనంతుడు విరజుడికి కూడా నచ్చటంతో వారి స్నేహం దినదిన ప్రవర్ధమానం కాసాగింది.

అయితే, విరజుడిలో తను రాజకుమారుడి నన్న అహంకారానికి మూర్ఖత్వం కూడా తోడు కావడంతో, అనంతుడి మీద అప్పుడప్పుడూ అధికారం చలాయించేవాడు. అయినప్పటికీ అనంతుడు కోపం తెచ్చుకోకుండా విరజుడి పట్ల మిత్రభావాన్ని ప్రదర్శించేవాడు.

విరజుడికి గురువు చెప్పే పాఠాలు ఒకంతట తలకెక్కేవి కాదు. అయితే అతడు గురువు దగ్గర ఏమీ మాట్లాడక, తీరిక సమయాల్లో అనంతుణ్ణి వేధించేవాడు. అనంతుడు ఏమాత్రం విసుగు చెందకుండా పాఠ్యాంశం విరజుడికి గ్రాహ్యమయ్యేలా ఒకటికి నాలుగు సార్లు బోధించేవాడు.

ఈ విధంగా విరజుడు చదువులో కాస్త చురుకుదనం పుంజుకోగానే, గురువు గోబిలుడుదాన్ని గమనించి, అతడికి మరింత ప్రోత్సాహజనకంగా వుండడంకోసం, అడపాదడపా ప్రశంసించటం ప్రారంభించాడు. మొట్టమొదటిసారి గురువు ప్రశంసించగానే విరజుడు, అనంతుడితో, "అనంతా! ఈ రోజు గురువుగారు నన్ను ప్రశంసించారంటే, ఆ ఘనత అంతా నీదే. నీ మేలు ఎన్నటికీ మర్చిపోను. నేను రాజునవగానే నిన్ను నా ప్రధాన మంత్రిని చేసుకుంటాను!" అన్నాడు.

విరజుడి మాటలకు అనంతుడు చాలా సంతోషించాడు. గోబిలుడు కూడా ఆ సంగతి విని చాలా ఆనందించి, విరజుణ్ణి మరింతగా మెచ్చుకుంటూ, "నాయనా, మనిషిని పశుత్వం నుంచి వేరు చేసే ఉత్తమ గుణాల్లో కృతజ్ఞత ఒకటి! నువ్వు అనంతుడి పట్ల చాలా ఉదాత్తంగా ప్రవర్తించావు. ఈ రోజు నువ్వు చేసిన వాగ్దానాన్నికలలో కూడా విస్మరించకుండా నిలబెట్టుకో," అని హితవుపలికాడు. విరజుడు అలాగేనన్నట్టు తలాడించాడు.

అయితే, ఆ తర్వాత జరిగింది మాత్రం వేరు. అతడు క్రమేపీ చదువులో కొంత రాణిస్తూ, నానాటికీ అహంకారం పెంచుకుని, అనంతుణ్ణి నిర్లక్ష్యం చెయ్యడం ప్రారంభించాడు. అలా కొంతకాలంగడిచి, ఇద్దరి విద్యాభ్యాసం ముగింపుకు వచ్చేనాటికి, విరజుడు తనవాగ్దానాన్ని పూర్తిగా మరిచినట్లు అందరికీ తెలిసిపోయింది.

అనంతుడు గురుకులంలో తన విద్యాభ్యాసం ముగియగానే, గురువు గోబిలుడితో, ''స్వామీ! నాకింకా విద్యాతృష్ణ తీరలేదు. తమరు అనుమతిస్తే, ఆరావళీ పర్వత పాదాల వద్దవున్న కృష్ణచంద్రులవారి గురుకులంలో కొన్నాళ్ళు విద్యాభ్యాసం చెయ్యాలనివున్నది. ఆ తర్వాత అవసరమనిపిస్తే, విరజుడితో అతడు నాకు చేసిన వాగ్దానం గురించి మాట్లాడతాను,'' అన్నాడు.

గోబిలుడు, అనంతుడు కోరిన దానికి సంతోషంగా, ''ఆ మహనీయుడి దగ్గర శిష్యరికం చేసే పరిపూర్ణమైన అర్హత నీకున్నది. వెళ్ళిరా, నాయనా, సుభస్య శీఘ్రం!'' అంటూ ఆశీర్వదించి పంపించాడు.

ఆ తర్వాత, విరజుడు కూడా గురుదక్షిణ చెల్లించి, రాజధానికి తిరిగివెళ్ళాడు. నెమ్మదిగా ఆరు సంవత్సరాలు గడిచాయి. విరజుడికి పట్టాభిషేకం జరిగింది. అతడు రాజవుతూనే, తనకు పూర్తి అనుకూలంగా ప్రవర్తించేసుప్రతీకుడనేవాణ్ణి, తన ప్రధాన సలహాదారుగా నియమించుకున్నాడు. పాలనా వ్యవహారాల్లో, ఈ ప్రధాన సలహాదారు మాట వేదవాక్యంగా చెల్లడం ప్రారంభించింది.



సుప్రతీకుడూ, రాజూ కలిసి వినూత్న పరిపాలన పేరిట, పరిపాలనలో అనేకమార్పులూ, సంస్కరణలూ ప్రవేశపెట్టారు. ఇందువల్ల ప్రజలు లేనిపోని అయోమయావస్థలోపడి, తమకు అటువంటి దురవస్థ కలిగించిన రాజుపట్ల తీవ్రమైన అయిష్టత కనబరచసాగారు. ఇదే ఊతంగా చేసుకుని పొరుగు రాజు, విరజుడి రాజ్యంపై దండెత్తాలనుకుంటున్నాడని చారులవల్ల విరజుడికి తెలిసింది. విరజుడు కాస్త కంగారుపడి, సుప్రతీకుణ్ణి సంప్రదించాడు.

సుప్రతీకుడు తేలిగ్గా, ''భయం ఎందుకు, ప్రభూ! మనం హెచ్చువేతనం మీద మరింత మందిని సైన్యంలో చేర్చుకుని, మనమే ముందుగా పొరుగురాజు మీద దండెత్తుదాం. ఆ రాజ్యం కూడా మనవశమైతే, తమకీర్తి ప్రతిష్ఠలు నలుదిశలా మరింత ఇనుమడిస్తాయి!'' అన్నాడు.



"నువ్వు చెప్పేదేదీ చిటికలో ముగిసే పనికాదు. మనఖజానాలో అంతగా నిల్వడబ్బు లేదని, నీకు తెలియనిదా?" అన్నాడు.

దానికిసుప్రతీకుడు నవ్వి, "మన ఖజానా నింపేందుకు, ఒక తిరుగులేని ఉపాయం ఆలోచించాను. యక్షిణీశైలం గురించి మీకు తెలుసుగదా?" అన్నాడు.

విరజుడుకియక్షిణీశైలం గురించి తెలుసు. మందారదేశానికి ఉత్తరపుటెల్లగావున్న పెద్ద పర్వతాన్ని యక్షిణీశైలంగా వర్ణించి చెబుతారు. ఆ పర్వతం మీదవున్న ప్రాచీనశివాలయం ముఖమండపం దగ్గర, దేవనాగరలిపిలో వున్న ఒక శిలాశాసనంవున్నది. అందులో, ఈ ఆలయం ముందున్న కోనేటి మధ్యభాగంలో నిరంతరం వేగంగాతిరిగే సుడి ఒకటివున్నది. మంత్ర తంత్ర శాస్త్రజ్ఞానీ, సాహసీ, నిస్వార్థ పరుడూ అయిన యువకుడు, ఆ సుడిలో ప్రవేశించి అక్కడఎదురయ్యే యక్షమాయను జయించినట్లయితే, అతడికి అష్టసిద్ధులూ, నవనిధులూ లభిస్తాయి, పరాజితుడైతే అక్కడి నుంచే నరకకూపంలోకి తోయబడతాడు, అనివున్నది.

సుప్రతీకుడి మాటతో అదంతా స్ఫుర ణకు తెచ్చుకున్న విరజుడు చిక్కముఖం వేసి, "యక్షిణీశైలం గురించి తెలిసి ఏం లాభం? ప్రాణాలకు తెగించి, ఆ కోనేటిలో దూకడం నావల్లకాదు," అన్నాడు.

ఆ జవాబుకు సుప్రతీకుడు నవ్వి, "అక్కడికి మిమ్మల్ని వెళ్ళమని చెప్పడం లేదు, ప్రభూ! అనంతుడనే యువకుడు ఒకడు కొత్తగా మన రాజ్యానికి వచ్చాడు. అతడు ఆరావళీ పర్వత ప్రాంతంలోని కష్ణ చంద్రుడనే గురూత్తముని వద్ద మంత్ర శాస్త్రాన్ని కూలంకషంగా అభ్యసించాడట. ఇతర విద్యలు కూడా అతడికి కరతలామల కాలేనట. అతడు మన వర్తకుల శ్రేష్ఠి ఇంట ఆతిథ్యం పొందారు. ఆ అనంతుడు గొప్ప సాహసి అనీ, ఎన్నదగ్గ నిస్వార్థపరుడనీ ప్రజలు చెప్పుకుంటున్నారు. మనం ఆ అనంతుణ్ణి పిలిపించి, రాజ్యక్షేమంకోసం యక్షిణీశైలానికి వెళ్ళమని అడుగుదాం. నిధులతో తిరిగి వస్తే, అతడి ఎత్తు బంగారాన్ని బహుమానంగా ఇస్తా మనిచెబుదాం. ఏమంటారు?" అనిఅడిగాడు.

అనంతుడి పేరు వింటూనే ఉలిక్కిపడిన విరజుడు, ఒక్కక్షణం ఆలోచించి, సుప్రతీకుడు చెప్పినదానికి అంగీకరించాడు. మరుక్షణమే అనంతుడికి కబురువెళ్ళింది.

అనంతుడు రాగానే విరజుడు ఎంతో అభి మానంగా కుశలప్రశ్నలు వేశాడు. తర్వాత,

అతడు యక్షిణీశైలాన్ని గురించి చెప్పిన దంతా శ్రద్ధగా విన్న అనంతుడు, "ప్రభూ! మనం ఒకరి గురించి ఒకరికి క్షుణ్ణంగా తెలిసినవ్యక్తులం. మీకోరిక ప్రకారం నేను యక్షిణీశైలానికి తప్పకవెళతాను," అన్నాడు.

అన్నమాట ప్రకారం అనంతుడు ఒకానొక సుముహూర్తానయక్షిణీశైలానికివెళ్ళి మంత్రం జపించి కోనేటిలో దిగాడు.

అనంతుడితో బాటే వెళ్ళి, కోనేటి ఒడ్డునే కూర్చున్న విరజుడికి, చాలాసేపు గడిచిన తర్వాత, అనంతుడు రెట్టింపు తేజస్సుతో ప్రకాశిస్తూ, కోనేటి నుంచి బైటికిరావడం కనిపించింది. అతడు వెంటనే అనంతుడి దగ్గిరకు వెళ్ళి చెయ్యిపట్టుకుంటూ అత్రుతగా, "అనంతా! నిధి దొరికిందా, ఏదీ?" అంటూ ప్రశ్నించాడు.

అనంతుడు మందహాసంచేసి, "రండి, చూపిస్తాను. మీ కెలాంటి ప్రమాదం కల గదు!" అని విరజుడి చెయ్యి పట్టుకుని మళ్ళీకోనేటిలోకి దిగాడు. దాని అట్టడుగున సూర్యకిరణాల్లా ప్రకాశిస్తున్న నవరత్నాల గుట్టలు కనిపించాయి. విరజుడు మంత్ర ముగ్ధుడిలా అయిపోయాడు. అప్పుడు అనంతుడు ప్రశాంతంగా, "ప్రభూ! నేను సాధించిన ఈ అమూల్యమైన నిధినిక్షేపాల్ని, మీ కోరిక ప్రకారం రాజ్యక్షేమంకోసం వినియోగించేందుకు, ఈక్షణమే మీపరంచేస్తాను. అయితే దీనికి ప్రతిఫలంగా, మీ నుంచి నాకు కావలసింది బంగారం మాత్రం కాదు!" అన్నాడు.

ఆ మాటలకు విరజుడు చాలా ఆశ్చర్యపోతూ, "మరేంకావాలి?" అని ప్రశ్నించాడు.

"మీరు పూర్వం గురుకులంలో చేసిన



వాగ్దానం ప్రకారం, నన్ను మీ ప్రధానామాత్యుడిగా నియమించుకోండి. అదే నాకు కావలసింది!'' అన్నాడు అనంతుడు గంభీరంగా.

విరజుడు ఆ మాట వింటూనే కొద్దిక్షణాలు నోటమాటరానివాడిలా వుండిపోయి, తర్వాత కళ్ళనీళ్ళు పెట్టుకుని వంగి అనంతుడి పాదాలు స్పృశించి, ''మహానుభావా! నువ్వు సామాన్య మానవుడివి కావు. ఈ క్షణంనుంచీ నువ్వే నా ప్రధాన మంత్రివి! నీ అనుజ్ఞలేనిదే నేనిక ఊపిరి సైతం పీల్చను,'' అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, నిధి సంపాదనలో, విరజుడి స్వార్థం తేట తెల్లమవుతూనే వుంది. ఎటొచ్చీ ఎంతో విద్యాధికుడూ, సాహసీ అయిన అనంతుడి ప్రవర్తనే అవివేకంగా కనబడుతున్నది. అతడు నిస్వార్థపరుడైన పక్షంలో నిధుల్ని విరజుడికి అప్పగించి ప్రతిఫలం ఏమీ ఆశించకుండా వెళ్ళిపోవాలి. లేదా సాధించిన నిధిలో కొంత తీసుకోవాలి. అదీగాక ఇదీగాక, విరజుడు కపటీ, అతడు చేసేవాగ్దానాలకు విలువలేదని ఎరిగీ, మంత్రిపదవి కోరడం ఏమన్న విజ్ఞత అనిపించుకుంటుంది? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కుడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''అనంతుడు మొదటి నుంచీ రాజ్యక్షేమాన్ని కోరిన నిస్వార్థపరుడు. అందుకే అతడు, భావిమహారాజైన విరజుడికి గురుకులంలో తగిన సహాయం చేశాడు. విరజుడు కపటీ, స్వార్థపరుడూ కావచ్చు. కానీ, అప్పటి పరిస్థితుల్లో, ప్రజల వ్యతిరేకతా, ఖజానాలో ధనం లేకపోవడం, పొరుగురాజు దండయాత్రాభయం, పాలనా వ్యవహారాల్లో సుప్రతీకుడిలాంటి అల్పజ్ఞుడి సలహాలూ-వీటన్నిటి కారణంగా దేశరక్షణకు తనలాంటి వాడి అవసరం వున్నదన్న గట్టినమ్మకంతోనే, అనంతుడు మంత్రిపదవిని కోరాడు. ఇది అతడి దేశభక్తినీ, రాజకీయ పరిజ్ఞానాన్నీ చాటి చెబుతుంది. ఇదిగొప్ప వివేకం. అవివేకం అంటూ ఇందులో ఏమాత్రం లేదు!'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. - (కల్పితం)

[ఆధారం: ''శ్రీలలిత'' రచన]



## పెరిగిన జంతు సంఖ్య




నశించి పోతున్న డోస్ లాంగర్స్ జంతు సంతానాభి వృద్ధికి ప్రపంచంలోనే ప్రప్రథమంగా కృషి చేస్తూన్న సంస్థ సింగపూర్‌లోని జంతు ప్రదర్శనశాల. ఇక్కడ ఒక లాంగర్ పుట్టిందని ప్రదర్శనశాల అధికారులు తెలియజేశారు. ఇటీవల పుట్టిన రెండవ జంతువు ఇది. ఆ విధంగా ఈ జంతువుల సంఖ్యలో రెండు పెరిగాయన్న మాట. ఈ జాతి జంతువులు సాధారణంగా వియత్నాంలోనూ, లావోస్‌లోనూ కనిపిస్తాయి. ఈ రెండు లాంగర్ పిల్లలు, చూపరులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. ఇవి ఇలా ఆకర్షించడానికి మరొక కారణం కూడా ఉంది. ఈ రెండు కొదమలకు మంచి పేర్లు పెట్టే ప్రయత్నంలో ఉన్న ప్రదర్శనశాల అధికారులు, మంచి పేరు సూచించిన వారికి బహుమతిని ప్రకటిస్తూ ఒక పోటీని ఏర్పాటు చేయడమే అది.

## రైలులో పద్యపఠనం

మనదేశం దక్షిణాగ్రమైన కన్యాకుమారినుంచి రాజధాని ఢిల్లీ వరకు నడిచే రైలును ఇటీవల ప్రవేశపెట్టారు. సుప్రసిద్ధ తమిళగ్రంథం తిరుక్కురళ్ పేరు మీదుగా దీనికి 'తిరుక్కురళ్ ఎక్స్‌ప్రెస్' అని పేరుపెట్టారు. కన్యాకుమారిలో బయలుదేరిన నాలగవ రోజు ఇది రాజధానికి చేరుకుంటుంది. ఈ రైలు ప్రారంభోత్సవం రోజున కన్యాకుమారి ప్రాంతంలోని కొళత్తూరుకు చెందిన ఐదేళ్ళ అమ్మాయి ప్రతీక్ష ఈ రైలులో ప్రయాణం చేసింది. ఆమె ప్రయాణ సమయంలో ఇరవై పైచిలుకు రైలు పెట్టెలలోకి వెళ్ళి ప్రయాణీకులకోసం తిరుక్కురళ్ పద్యాలను వినిపించింది. ప్రయాణం ముగిసే లోపల ఆమె తిరుక్కురళ్‌లోని 1,330 పద్యాలను అప్పగించింది. తిరువళ్ళువర్ దాదాపు 2000 సంవత్సరాలకు పూర్వం తిరుక్కురళ్‌ను రచించాడు.



# మూడవ వరం

విపులుడు, చంద్రకాంతుడు అనే ఇద్దరు మిత్రులు దారిపక్కన సత్రంలో కూర్చుని ఏవో పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. అప్పుడు ఒక అపరిచితుడు అక్కడికి వచ్చి ఒక ఉంగరం చూపుతూ, "ఈ వజ్రపుటుంగరాన్ని, మీ రెవరైనా కొనుక్కుంటారా?" అని అడిగాడు.

ఆ ఇద్దరు మిత్రుల్లో విపులుడు ధనికుడు. చంద్రకాంతుడు పేద ఉపాధ్యాయుడు. అందు వల్ల చంద్రకాంతుడికి దాన్ని కొనే శక్తీ, ఆసక్తీరెండూ లేవు. విపులుడికి ఆ విలువైన ఉంగరాన్ని కొను క్కోవాలనిపించింది.

"ఈ ఉంగరం నీకెక్కడిది?" అని అడిగాడు విపులుడు దానిని తెచ్చిన వ్యక్తిని.

"ఆ సంగతి చెప్పను. వద్దంటే చెప్పు. దీన్ని నగల వ్యాపారికి అమ్ముకుంటాను. డబ్బు వెంటనే కావాలి గనకే నీ దగ్గరికి వచ్చాను," అన్నాడు ఉంగరం తెచ్చినవాడు.

విపులుడు వాణ్ణి తన ఇంటికి రమన్నాడు. వాడు చాలా సంతోషంగా చంద్రకాంతుడితో కలిసి, అతని వెంట బయలుదేరాడు. విపులుడు వాడితో అమితస్నేహంగా మాట్లాడుతూ ఇంటికి తీసుకుపోయి, వాడికి చెందవలసిన మొత్తాన్ని ముట్టజెప్పాడు. ఆ తరవాత, "మిత్రమా, బాగా పొద్దుపోయింది. ఇంత డబ్బు తీసుకుని రాత్రి పూట వీధుల గుండా వెళ్ళడం క్షేమం కాదు కదా?" అన్నాడు.

విపులుడి అనుమానం సబబైనదే అన్నాడు చంద్రకాంతుడు. ఇద్దరి మాటలూ విన్న వచ్చిన వాడు ఆ రాత్రికి అక్కడే వుండి తెల్లవారాక బయలు దేరుదామని అనుకున్నాడు.

చంద్రకాంతుడు వెళ్ళిపోయాక, ఉంగరం అమ్మినవాడికి, విపులుడు రుచికరమైన విందు భోజనం ఏర్పాటు చేశాడు. వాటితో పాటు మత్తు పానీయం కూడా అందించాడు. మత్తు పానీయం



కడుపులోకి చేరగానే, అతిథి, విపులుణ్ణి తెగ పొగడడం ప్రారంభించాడు. ఆ తరవాత తనకు ఉంగరం ఎలా లభించిందో కూడా చెప్పేశాడు:

పట్టణానికి కొద్దిదూరంలోని అడవిలో వున్న తాంత్రికుడు ప్రతి అమావాస్య అర్ధరాత్రి సమయంలో యజ్ఞం చేస్తాడు. యజ్ఞం పూర్తయ్యాక, కోరినవారికి కోరిన వరం ఇచ్చేశక్తి అతనికి వస్తుంది. ఒకనాడు ఈ అతిథి అక్కడికి వెళ్ళి, తాంత్రికుడికి ప్రీతికరంగా నడుచుకోవడంతో, సంతోషించిన ఆయన యజ్ఞం పూర్తి చేయగానే, చేతిలోకి చిటికెడు విబూది ఇచ్చి, ఏదో మంత్రం చెప్పి, "బిడ్డా, మూడు క్షణాలలోగా నీకిష్టమైనది కోరుకో," అన్నాడు.

అతడు వజ్రపుటుంగరం కావాలని కోరుకున్నాడు. ఆక్షణమే అతని చేతిలోకి అది వచ్చింది. దానిని చూసి మొదట సంతోషించినప్పటికీ, ఆ తరవాత, "అయ్యో, ... రాజ్యాన్ని కోరుకోకుండా పోయానే," అని పశ్చాత్తాపపడ్డాడు.

తెల్లవారగానే, అతిథి, విపులుడు పెట్టిన ఫలహారంతిని, సంతోషంగా వెళ్ళిపోయాడు.

విపులుడు ఎలాగైనా అడవికి వెళ్ళి తాంత్రికుణ్ణి చూసి వరం పొందాలని నిర్ణయించాడు. అయితే ఒంటరిగా వెళ్ళడానికి ధైర్యం చాలలేదు. నమ్మకస్థుడైన మిత్రుడు చంద్రకాంతుణ్ణి పిలిపించి, సంగతి చెప్పి, అతన్ని తనకు తోడుగా రమ్మని కోరాడు.

అంతా నిర్లిప్తంగా విన్న చంద్రకాంతుడు, "భగవంతుడు నీకు కావలసినంత ధనం ఇచ్చాడు. ఇంకా ఎందుకు ఆశిస్తావు. మనిషికి కావలసింది మానసిక ప్రశాంతత. నిజాయితీగా ఉంటూ, చుట్టూ ఉన్న వారికి చేతనైన సాయం చేస్తూ జీవించడంలో ఉన్న ఆనందం మరెందులోనూ రాదు," అన్నాడు.



"నేను ధనమే కోరుకుంటాననే నిర్ణయానికి నువ్వెలా వచ్చావు?" అని అడిగాడు విపులుడు.

"చూడు మిత్రమా! సక్రమంగా దేన్నయినా పొందాలంటే రెండే మార్గాలున్నాయి. మొదటిది సహజంగా మనకు ప్రాప్తిస్తాయి. రెండవది శ్రమించి సాధించాలి. అలా కాకుండా అడ్డదారులలో సంపాయించాలనుకోవడం అవివేకం. ఎవరో తాంత్రికుడి ద్వారా ఏదో సాధించాలనుకుంటే అవి తీవ్ర పర్యవసానాలకు దారితీస్తాయి," అని హెచ్చరించాడు చంద్రకాంతుడు.

అయితే, తాంత్రికుడి దగ్గరికి వెళ్ళి తీరాలని విపులుడు పట్టుపట్టాడు. ఒకవైపు మిత్రుడి పట్ల ఉన్న సానుభూతి కొద్దీ, మరొకవైపు మిత్రుడి అసంతృప్తికి గురికావడం భావ్యం కాదన్న ఉద్దేశంతోనూ చంద్రకాంతుడు విపులుడికి తోడుగా వెళ్ళక తప్పలేదు.

అమావాస్య చీకట్లు కమ్ముకుంటూండగా, ఇద్దరు మిత్రులూ అడవిలో ప్రవేశించి తాంత్రికుడి కుటీరాన్ని కనుగొన్నారు. తాంత్రికుడు



వాళ్ళపట్ల ఎంతో ఆదరం చూపాడు. అడవిలో దారితప్పి వచ్చారని భావించి వారికి భోజనం పెట్టాడు. "ఈ రాత్రికి మీరు ఇక్కడ నా కుటీరంలోనే గడిపి వెళ్ళవచ్చు. నేను ఇప్పుడు ఒకయజ్ఞంచేయాలి. అది పూర్తికాగానే ఈ అడవి వదిలి వెళ్ళిపోతాను," అన్నాడు తాంత్రికుడు.

"అడవి వదిలి ఎందుకు వెళ్ళిపోతున్నారు, స్వామీ," అని అడిగాడు విపులుడు.

"దానిని గురుంచి నీ కెందుకు విచారం, నాయనా? నేనొక మహత్కార్యాన్ని సాధించాలని, ఇక్కడ ప్రతి అమావాస్య రాత్రి యజ్ఞం చేస్తూ వస్తున్నాను. ఈ రాత్రి యజ్ఞంతో అది పరిసమాప్త మవుతుంది," అన్నాడు తాంత్రికుడు.

"మీరిచ్చే చిటికెడు విబూదిని చేతిలో ఉంచు కుని మూడు కోరికలను కోరుకుంటే అవి సిద్ధి స్తాయన్నది, నిజమా? కాదా?" అని అడిగాడు విపులుడు.

ఆప్రశ్న విని విస్మయం చెందిన తాంత్రికుడు, "ఆ సంగతి నీకెవరు చెప్పారు? బహుశా వజ్రాన్ని పొందిన ఆ వెర్రిబాగులవాడే చెప్పి ఉంటాడు. అవును. వాడి మీది జాలికొద్దీ అలా చేశాను. ఉంగరం సంగతి ఎవరికీ చెప్పవద్దని హెచ్చరించాను కూడా!" అన్నాడు తాంత్రికుడు.

"నా మీద కూడా అలాంటి కరుణ చూప వచ్చు కదా?" అని అడిగాడు విపులుడు.

ఆ మాటకు తాంత్రికుడు నవ్వి, "నాయనా, నువ్వు ఆజ్ఞాపించి నా నుంచి కరుణను పొంద లేవు. కొందరిని చూస్తే జాలి కలుగుతుంది. మరికొందరిని చూస్తే కలగదు. నీ పట్ల కరుణ చూపడానికి నాకెలాంటి కారణమూ కనిపిం చడం లేదు," అన్నాడు.

"నాకాసాయం చేయడం వల్ల నీకు వాటిల్లే నష్టం ఏదీ లేదు కదా? దానికెందుకిలా మొండి కెత్తుతావు?" అన్నాడు విపులుడు.

"అది నీకు తీరని హాని చేయవచ్చు! నా యజ్ఞానికి ఆటంకం కలిగించ వద్దని హెచ్చరి స్తున్నాను," అన్నాడు తాంత్రికుడు గంభీరంగా.

"అయితే, నువ్వు నా కోరికలు తీరిస్తే తప్ప, నీ యజ్ఞాన్ని ఇక్కడ సక్రమంగా జరగ నివ్వను. ఆటంకాలు కలిగిస్తూనే ఉంటాను. అంతలో తెల్లవారిపోయి, పుణ్యకాలం కాస్తా వెళ్ళి పోతుంది," అని బెదిరించాడు విపులుడు.

"నిజంగానా!" అన్నాడు తాంత్రికుడు ఆగ్రహంతో.

జరుగుతున్న దానిని చూస్తూంటే చంద్ర కాంతుడికి జుగుప్స కలిగింది. "విపులా, దయచేసి తాంత్రికుడి ఆగ్రహానికి గురి కావద్దు. అది నీకు మంచిది కాదు," అని స్నేహితుణ్ణి మెల్లగా హెచ్చరించాడు.

"నువ్వు ఇందులో జోక్యం చేసుకోవద్దు. అవతలికి వెళ్ళు. నేనీ సువర్ణ అవకాశాన్ని వదల దలుచుకో లేదు," అన్నాడు విపులుడు.

చంద్రకాంతుడు మెల్లగా బయటికి నడిచి, ఏంచేయడానికీ నిర్ణయించుకోలేక కుటీరం పక్కన నిలబడ్డాడు. తాంత్రికుడు నిప్పురగిలించి ఏవో మంత్రాలు వల్లించసాగాడు. విపులుడు పక్కనే నిలబడ్డాడు. కొంత సేపయ్యాక, తాంత్రికుడు చిటికెడు బూడిద తీసి విపులుడి అరచేతిలో ఉంచాడు. విపులుడు ఎలాంటి వరాలు కోరుకున్నాడో చంద్రకాంతుడికి వినిపించలేదు. కాని మంటల కాంతిలో తాంత్రికుడి ముఖంలో హేళన మాత్రం అతనికిస్పష్టంగా కనిపించింది.

"నేను తలపెట్టిన బృహత్కార్యం సాధించాలంటే ఈ రాత్రికినేను అబద్ధం చెప్పకూడదు. ఇతరులకు అసంతృప్తి కలిగించకూడదు. అందుకే నీ కోరికలు సిద్ధించేలా వరం ఇచ్చాను. ఇకవెళ్ళు ఇక్కణ్ణించి," అన్నాడు తాంత్రికుడు.

విపులుడు ఆయనకు వంగి నమస్కరించి పరమానందంతో కుటీరం నుంచి వెలుపలికి వచ్చి, మిత్రుణ్ణి కలుసుకున్నాడు. ఇద్దరూ తిరుగుముఖంపట్టారు.

తెల్లవారగానే ఇద్దరూ నదిలో స్నానం చేసి, గ్రామం మధ్య ఉన్న రచ్చబండ సమీపానికి వచ్చారు. ఏదో పండుగ సందర్భంగా గ్రామ ప్రజలందరూ అక్కడ గుమిగూడి ఉన్నారు. వాళ్ళను చూడగానే విపులుడు తన మిత్రుడితో, "వీళ్ళందరూ నా పాలితులవుతారు. నేను మహారాజును కాబోతున్నాను కదా!" అన్నాడు.

"ఆ వరమేనా నువ్వు కోరుకున్నది?" అని అడిగాడు చంద్రకాంతుడు.

"అది వరాల్లో ఒకటి మాత్రమే!" అన్నాడు విపులుడు.

"మరి, మిగిలిన రెండు వరాలు?" అని అడిగాడు చంద్రకాంతుడు.

"నేను ఎన్నడూ వ్యాధిగ్రస్తుణ్ణి కాకూడదు; ముసలితనం రాకూడదు."

"మరి దీర్ఘాయుష్షును ఎందుకు కోరుకోలేదు?"

"మరీ అంత మూర్ఖుడిగా ఉన్నావేమిటి? ముసలితనం రాకూడదంటే, నేనెప్పుడూ యౌవనంలో ఉంటాననే కదా అర్థం!"

హఠాత్తుగా విపులుడి ముఖం పాలిపోయింది. అతడు గుండె పట్టుకుని అలాగే కుప్పకూలిపోయాడు.

"నేనే పరమ మూర్ఖుణ్ణి. నేను కోరుకున్న మూడవ వరం, నాకు ముసలితనం వచ్చేంత వరకు నన్ను ప్రాణాలతో ఉండనీయదని గ్రహించలేకపోయాను," అంటూ విపులుడు మూలుగుతూ ప్రాణాలు విడిచాడు. - బిందుసార్



# పద్దెనిమిది రహస్యం

అది 1945 జూలై 30వ తేదీ. హాలీవుడ్‌లో సూర్యోదయ సమయం. నిర్మానుష్యంగా ఉన్న రోడ్డు మీద తిన్నగా వెళుతూన్న చిన్న వ్యాన్‌ను, పొదలచాటు నుంచి వచ్చిన ఇద్దరు మనుషులు అడ్డగించారు. ఆ ఇద్దరిలో ఒకడు, పొడవుగా, సన్నగా, ఆతృతతో ఉన్నాడు. రెండవవాడు పొట్టిగా, లావుగా నెమ్మదిగా ఉన్నాడు. తుపాకీ గురిపెట్టి, వాహనంలోని ఇద్దరిని బయటకు లాగారు. వాళ్ళ కళ్ళకు గంతలు కట్టి, నోట్లో గుడ్డలు కుక్కి లాక్కుపోయి దాపులనున్న చెట్టుకు కట్టారు.

ఆ తరవాత వ్యానులోకి జొరబడి, అందులోని ఆరుసంచీల వెండినాణాలనూ, ఒక అట్టపెట్టెనిండుగా ఉన్న కొత్త డాలర్‌నోట్లనూ తీసుకుని కొద్ది దూరంలో ఆపిన కారులోకి చేరవేసి, శరవేగంతో ఉదయపు పొగమంచులోకి దూసుకుపోయారు.



పట్టపగలు జరిగిన భయంకరమైన దొంగతనం అది! ఆ వ్యాన్ హాలీవుడ్ స్టేట్ బ్యాంకుకు చెందినది. చాలా సేపయ్యాక, చెట్టుకు బంధించబడిన ఇద్దరు బ్యాంకు ఉద్యోగులు, ఆ దారిగుండా వెళుతున్న వారిసాయంతో బయటపడ కల్గారు. వారు భయంతో గడగడలాడిపోయారు. అంతా రెప్పపాటులో జరిగిపోయింది. తమను తాము రక్షించుకోలేకపోయారు. లాక్‌హీడ్ కంపెనీ కార్మికుల జీతాల కోసం బ్యాంకు నుంచి తీసుకువెళుతున్న ధనాన్ని భద్రంగా అక్కడికి చేర్చే తమ బాధ్యతను సక్రమంగా నెరవేర్చలేకపోయినందుకు వాళ్ళు ఎంతగానో బాధపడ్డారు.

దొంగలు ఘోరమైన నేరానికి పాల్పడ్డారు. వాళ్ళ మీద అపహరణ, దారిదోపిడీ నేరాలు ఆరోపించబడ్డాయి. దొంగిలించిన మొత్తాన్ని పట్టుకోవాలంటే కేసు త్వరగా పరిష్కారం కావాలి. పోలీసులకూ, నేరపరిశోధకులకూ ఇదొక పెద్ద సవాలుగా మారింది.

బందిపోట్లు ఏమైనా ఆనవాళ్ళు వదిలారా? చాలామంది దగ్గర విచారణ జరిపారు. దోపిడీకి గురైన ఇద్దరు బ్యాంకు ఉద్యోగులను కూడా ప్రశ్నించారు. తన కళ్ళకు గంతలు కడుతూన్నప్పుడు, లావుపాటి చిన్న దొంగ చొక్కా మీద ఒక బ్యాడ్జ్ కనిపించిందనీ, అది



లాక్‌హీడ్ సంస్థ ఎంబ్లెమ్ అనీ వారిలో ఒక ఉద్యోగి చెప్పాడు. అంటే, ఆ దొంగ ఆ సంస్థలో పనిచేస్తూ న్నట్టు చూపుకోవడానికి అలా చేసి ఉండవచ్చు.

ఒకనాడు ఒక పోలీసు అధికారికి, నిర్మానుష్యంగా ఉన్న ప్రదేశంలో వదిలివేయబడిన ఒక కారు కనిపించింది. ఆ కారులోపల ఒక కాగితం ముక్కపై, ఒక వ్యక్తి పేరూ, చిరునామా కనిపించాయి. వెంటనే అక్కడికి వెళ్ళి, ఆ ఇంటి తలుపు తట్టాడు పోలీసు అధికారి. ఒక స్త్రీ తలుపు తీసి, పోలీసులకేసి ఆశ్చర్యంగా చూసింది.

"దర్యాప్తు కోసం వచ్చాం," అన్నారు పోలీసులు.

"అలాగా! సరే కానివ్వండి," అని సమాధనం ఇచ్చింది ఏబ్లార్డ్ అనే మధ్యవయస్కురాలైన ఆ స్త్రీ.

పోలీసులు ఇల్లంతా వెతికారు. ఆతరవాత ఏబ్లార్డ్ పిల్లలు బంతి ఆట ఆడుకుంటూన్న తోటలోకి వెళ్ళారు. ఒక కుర్రాడు విసిరిన బంతి, వేగంగా వెళ్ళి, కాంపౌండ్ చివర ఉన్న షెడ్‌లోకి వేగంగా దొర్లుకుంటూ తలుపు కింద వున్న సందు గుండా లోపలికి వెళ్ళింది. పిల్లలు దాని వెనక పరిగెత్తారు. అయితే తలుపుకు తాళం వేసి ఉంది.

"ఆ షెడ్‌లో ఏం వుంది?" అని అడిగాడు ఒక పోలీసు అధికారి.

"రెండు వారాలక్రితం ఇద్దరు యువకులు వచ్చి దానిని అద్దెకు తీసుకున్నారు. అయినా కొన్ని రోజులుగా వాళ్ళు అక్కడ కనిపించడం లేదు," అన్నది ఏబ్లార్డ్.

పోలీసు అధికారులు అనుమానంతో షెడ్ తలుపులు పగలగొట్టారు.

తమ బంతి దొరికినందుకు పిల్లలు చాలా సంతోషించారు. అయితే, వాళ్ళకన్నా మరింత ఎక్కువగా సంతోషించారు పోలీసు అధికారులు. ఎందుకంటే వాళ్ళకు ఆ షెడ్‌లో నేల మీద లాక్‌హీడ్ గుర్తింపు బ్యాడ్జ్‌తో ఉన్న ఒక చొక్కా, బ్యాంకు మెసెంజర్స్‌కు చెందిన ఆటోమేటిక్ రైఫిల్, రివాల్వర్లు కనిపించాయి.

పోలీసులు బ్యాడ్జ్‌ని లాక్‌హీడ్‌ఫ్యాక్టరీకి తీసుకువెళ్ళారు. అయితే, అందులోని నంబరుకూ అక్కడి ఉద్యోగుల పేర్లకూ సంబంధం లేదని పరిశోధన ద్వారా తెలియవచ్చింది. అంటే దొంగలు తెలివిగా, అసలు అంకెను చెరిపేసి, ప్రత్యేకమైన పెన్నుతో దొంగనంబరు రాశారన్న మాట. అయితే, సైన్స్ ప్రయోగశాలలో అల్ట్రా వయొలెట్ వెలుతురు కింద, బ్యాడ్జ్ కొన్ని అంకెలను సూచించింది.



తీసుకున్న వారి ఫోటోల సాయంతో, పోలీసులు జాన్సన్‌ను ఒక దారి పక్క హోటల్లో పట్టుకున్నారు. ఆరోజు సాయంకాలమే హార్డీ కూడా అదే హోటల్ పరిసరాలలో తచ్చాడుతూ పట్టుబడ్డాడు. ఇద్దరనీ జైల్లో బంధించారు.

దొంగిలించిన డబ్బును గురించి అడిగినప్పుడు మొదట తమకేమీ తెలియదన్నారు. ఆ తరవాత, తమ ప్రాణాలు తీసినా అదెక్కడ దాచామో చెప్పమన్నారు. అయితే, ఒకనాటి రాత్రి, జాన్సన్ పడక కింద నీళ్ళతోనిండిన ఒక పాత్ర కనిపించింది. ఆ నీళ్ళ మీద ఒక పాత డాలర్‌నోటు తేలుతున్నది.

అసంబద్ధమైన ఈ ప్రయోగం ఎందుకై వుంటుంది? వాళ్ళు డబ్బు దాచిన చోటు తెలుసుకోవడానికి ఇందులో ఏమైనా క్లూ దొరుకుతుందా? పరిశోధనా శాఖ మళ్ళీ రంగంలోకి దిగింది. బహుశా డబ్బును చిత్తడిగా ఉన్న చోట దాచారేమో! అందువల్ల కరెన్సీనోటు నీళ్ళల్లో పడేస్తే ఎన్నాళ్ళలో కుళ్ళిపోతుందో తెలుసుకోవాలని నిందితులు ఈ ప్రయోగానికి దిగారేమో!

వాటిలో ఒరిజినల్‌గా ముద్రించబడిన అంకెల జాడలు కనిపించాయి.

వెంటనే పోలీసులు లాక్‌హీడ్ ఉద్యోగుల రికార్డులను నిశితంగా పరిశీలించారు. బ్యాడ్జ్ మీది పాత నంబరు–పొడవాటి సన్నటి హడావుడి కార్మికుడు జాన్సన్‌కు చెందినదని కనుగొన్నారు. లావుగా, పొట్టిగా నిమ్మకు నీరెత్తినట్టు కనిపించే హార్డీ అతని స్నేహితుడని కూడా కనుగొన్నారు. అతను కూడా కంపెనీలో ఉద్యోగం చేసేవాడే. ఆఖరికి రహస్యం బయడపడింది. నేరస్థులు గుర్తించబడ్డారు.

అయితే, తోడుదొంగలు ఆపాటికే ఎప్పుడో కంపెనీని వదిలి పెట్టారు. వాళ్ళిప్పుడు ఎక్కడ ఉంటారు? ఫ్యాక్టరీ రికార్డుల నుంచి

తోడు దొంగలను జైలులో విడివిడి గదులలో బంధించారు. అయితే, ఒక గార్డ్ సాయంతో వాళ్ళు పరస్పరం చీటీల ద్వారా రహస్య సందేశాలను అందజేసుకుంటున్నట్టు అధికారులకు తెలిసింది. నేర పరిశోధకులు ఈ సందేశాలను చాలావరకు సేకరించారు. వాళ్ళ సందేశాలలో తరచూ '18' అంకె, 'కాగితం'

అనే మాట కనిపించాయి. "మనం ఇక్కడే చాలాకాలం ఉండిపోతే, శీతాకాలం వానలు కాగితాలను నాశనం చేయగలవు," అని ఒక సందేశంలోనూ, "మా చిన్న చెల్లెలు వాటిని రక్షించగలదు. అయితే ఆమె అక్కడికి చేరుకోవడం కష్టం," అని మరొక సందేశమూ తెలియజేశాయి.

'కాగితం' అనే మాట డబ్బుకు పర్యాయపదం అయివుంటుంది. అదే నిజమయితే, దానిని మరీ చిత్తడి ప్రదేశంలో, చిన్న పిల్లలు వెళ్ళలేని చోట దాచారన్న మాట. మరి 18 దేనికి సంకేతం? అది రోడ్ నంబర్ అయివుంటుందా?

పోలీసులూ, నేర పరిశోధకులూ '18' సంఖ్య చెక్కినరాతి ఫలకంగల రోడ్డుకోసం అన్వేషణ ప్రారంభించారు. అదికనిపించింది. దాని పక్కన వాళ్ళకొక సన్నటి మార్గం, దాని చివర పదడుగుల ఎత్తు తీగలకంచెగల శ్మశాన వాటిక కనిపించాయి.

"నిజమే, ఈ సమాధిరాయే సులభంగా జ్ఞాపకం ఉంచుకోగల కొండ గుర్తయివుంటుంది," అన్నాడు ఒక పోలీసు అధికారి.

"అవునవును. చిన్న పిల్ల, ఎత్తయిన తీగల కంచెను దాటి వెళ్ళ లేదు కదా?" అన్నాడు మరొక నేరపరిశోధనాధికారి ఉత్సాహంగా.

వాళ్ళ అనుమానాలన్నీ ఒకే చోటికి దారి తీశాయి. అధికారులు శ్రమకోర్చి శ్మశాన వాటికలో వరుసలు వరుసలుగా ఉన్న సమాధులనన్నిటినీ జాగ్రత్తగా పరిశీలించి చూశారు. మరేదైనా స్పష్టమైన ఆధారం లభిస్తుందా అని జాగ్రత్తగా చూడసాగారు. 1898 సంవత్సరంలో మరణించిన ఒక సైనికుడి సమాధిరాయి వెనక చెత్తాచెదారం, ఆకులూ అలములూ, కొమ్మలూ రెమ్మలూ కప్పిన ఎత్తయిన మట్టిదిబ్బ కనిపించింది!

అధికారులు దానిని తవ్వి చూశారు. సమాధిరాయి కింద చాలాలోతులో దొంగిలించిన - ఆరు సంచీల వెండి నాణాలూ, అట్టపెట్టె నిండుగా మిలమిలలాడే కొత్త డాలర్ నోట్లూ కనిపించాయి!

తాము కనుగొన్న దానిని గురించి జైల్లో వున్న తోడుదొంగలకు తెలియజేశారు. మొదట వాళ్ళు దానిని నమ్మడానికి నిరాకరించారు. అయితే ఆఖరికి, తమనేరాన్ని అంగీకరించక తప్పలేదు.



## గుజరాత్ జానపద కథ

# విదూషకుడి సమస్య



ఒకానొకప్పుడు వినయుడు అనే రాజు ఉండే వాడు. ఆయనకు చదరంగం అంటే మహా ఇష్టం. అయితే రాజుగనక, ఆయనతో సమ ఉజ్జీగా ఆడడానికి ఎవరూ ముందుకు వచ్చే వారుకారు. ఆస్థాన విదూషకుడు మాధవుడు మాత్రం రాజుదగ్గర ఉన్న చనువు కొద్దీ రాజుతో తరచూ చదరంగం ఆడేవాడు. సమయం ఉన్నప్పుడల్లా ఇద్దరూ చదరంగం బల్ల దగ్గర కూర్చునే వారు. రాజు విలువైన మణులు, మాణిక్యాలు ఆటలో పందెం కాసేవాడు. మాధవుడు సాధారణ వస్తువులను పందెంగా పెట్టేవాడు. విదూషకుడు చదరంగం ఆడడంలో చాలా నేర్పరి. రాజు అతనితో ఆడుతూ, ఎన్నో మెళకువలను నేర్చుకునేవాడు. ఆటలోకి దిగారంటే రాజు, విదూషకుడు అనే తరతమ భావాలు మరిచి పోయి, సమ ఉజ్జీలుగా భావించి, ఆటలో లీనమై పోయేవారు.

ఒకరోజు ఇద్దరూ ఆటలో నిమగ్నులై ఉన్నప్పుడు, అన్నను వెతుక్కుంటూ విదూషకుడి చెల్లెలు మోహిని సరాసరి రాజభవనంలోకి వచ్చింది. పేరుకు తగ్గట్టే ఆమె చాలా సౌందర్యవతి. ఆమెను చూసి రాజు ముగ్ధుడయ్యాడు. మరునాడు చదరంగం బల్ల ముందు ఆటకు కూర్చుంటూ, "మీ చెల్లెల్ని పందెం కాస్తావా? ఆటలో నేను గెలుపొందితే, ఆమెను నా రాణుల్లో ఒకతెగా చేసుకుంటాను," అన్నాడు రాజు విదూషకుడితో.

విదూషకుడు విస్మయంతో తనకేసి చూడడం గమనించిన రాజు, "ఒకవేళ ఆటలో నువ్వు గెలుపొంది నేను ఓడిపోతే, ప్రవాళ నగరాన్ని నీకు ఇస్తాను," అన్నాడు.

విదూషకుడు కొంచెంసేపు మౌనంగా ఆలోచించి, "ప్రభూ, మనం కాచేపందాలు సమంగా లేవు. పైగా నాకు నగరం మీద మక్కువ లేదు," అన్నాడు.

"మరేం కావాలో కోరుకో," అన్నాడు రాజు.

"తీరా చెప్పాక, ప్రభువులు ఆగ్రహించ కూడదు," అన్నాడు విదూషకుడు వినయంగా.

"కావలసినదాన్ని నిర్భయంగా కోరుకో, ఇస్తాను," అన్నాడు రాజు.

"తమరు తమ సోదరిని, మా చెల్లెలికిసమంగా పందెం కాయాలి," అన్నాడు విదూషకుడు.

రాజు ఒక్క క్షణం దిగ్భ్రాంతి చెందాడు. ఆ తరవాత నెమ్మదిగా ఆలోచించాడు. అప్పటికే విదూషకుడి చెల్లెల్ని వివాహమాడాలన్న నిర్ణయానికి వచ్చేశాడు గనక, "సరే, అలాగే," అని తల పంకించాడు రాజు.

ఆట ఆరంభమయింది. ఇద్దరూ ఏకాగ్రతతో ఆడసాగారు. విదూషకుడి వద్ద నేర్చుకున్న మెళకువలన్నిటినీ ఉపయోగించి, రాజు చాలా జాగ్రత్తగా పావులు కదపసాగాడు. విదూషకుడు ఇక ఓడి పోవడం తప్పదు అన్న పరిస్థితి ఏర్పడడంతో, రాజు మనసులో రకరకాల ఆలోచనలు కదలాడాయి. తను మోహినిని వివాహమాడే అద్భుత ఘడియలను తలుచుకుంటూ ఆటలో తప్పటడుగు వేశాడు. విదూషకుడు గెలిచాడు. రాజు ఓటమిని అంగీకరించాడు!

విదూషకుడు పరమానందం చెందాడు. "ప్రభూ! తమ సోదరిని పంపండి. వివాహమాడతాను," అన్నాడు వినయంగా.

"వివాహమాడతావా?" అంటూ విస్మయం చెందినరాజు, "నాకున్నది ఒక్కగానొక్క సోదరి. ఆమెకు అప్పుడే, నగరంలోని సంపన్న వర్తకుడితో వివాహమయింది. నీకు మరేం కావాలన్నా కోరుకో, సంతోషంగా ఇస్తాను," అన్నాడు.

"అది న్యాయం కాదు కదా ప్రభూ. తమరు ఆమెను పణంగా ఒడ్డారు కదా? ప్రభువులు మాట తప్పరని భావిస్తాను," అన్నాడు విదూషకుడు పట్టుదలతో.

రాజు విదూషకుడికి పట్టుబడిపోయినట్టు గ్రహించాడు. "సరే, రేపు నా సోదరి మా తల్లిని చూడడానికి ఇక్కడికి వస్తున్నది. ఆమెను నీ వెంట రమ్మంటే రాకపోవచ్చు. కాబట్టి ఆమెను నువ్వు వెంట బెట్టుకు వెళ్ళడానికి నీకు ఒక అవకాశం కల్పిస్తాను. ఆ ప్రకారం చెయ్," అంటూ ఏంచేయాలో చెప్పాడు.

రాజుగారి చెల్లెలు సునీతాదేవి అనుకున్నట్టు తల్లిని చూడడానికి రాజభవనానికి వచ్చింది. మరునాడు సాయంకాలం రాజు నదీ తీరంలో వాహ్యాళికివెళ్ళి వద్దామని ఆమెను ఆహ్వానించాడు. ముందు రాజూ, వెనకఆయన చెల్లెలూ వెళుతూండగా, ఆమె దాపులనున్న ఒక తామర తటాకాన్ని చూసింది. తటాకం





డండి. నీళ్ళల్లో మునిగి పోతున్నాను. కాపాడండి, కాపాడండి,'' అని కేకపెట్టింది.

ఎప్పుడు పిలుస్తుందా అని దాపులనే, కాచుకుని ఉన్న విదూషకుడు ఒక్క గెంతున గుర్రంపై నుంచి కిందికి దూకి సునీతను సమీపించి చేయి అందించాడు. యువరాణి అతడి చేయిపట్టుకుని గట్టు మీదికి ఎక్కి వచ్చింది. ''యువతీ రత్నమా, నా చేయి పట్టుకున్నావు గనక, ఇక నిన్ను వదిలి పెట్టను. నాతో వచ్చి, నన్ను వివాహమాడి, నాతోనే నా భార్యగా జీవించు,'' అన్నాడు విదూషకుడు ఉత్సాహంగా.

సునీతాదేవి ఒక్క క్షణం దిగ్భ్రాంతి చెందింది. ''నేను యువరాణి సునీతాదేవిని. నన్ను రక్షించినందుకు సర్వదా కృతజ్ఞురాలిని. అయినా, నేను వివాహితను. నిన్నెలా పెళ్ళాడగలను,'' అన్నది.

''అవన్నీ తరవాత మాట్లాడుకుందాం. ప్రస్తుతం నిన్ను ఇక్కడ ఒంటరిగా విడిచి వెళ్ళలేను. రా, మా ఇంటికి వెళదాం. గుర్రం మీదికి రా,'' అంటూ విదూషకుడు గుర్రం మీదికి ఎగిరి కూర్చున్నాడు.

సునీతాదేవి మరొక మార్గం కనిపించక మౌనంగా వెళ్ళి గుర్రాన్ని అధిరోహించి, విదూషకుడి వెనక కూర్చున్నది. గుర్రం నగరంలో ఒక మారుమూలనున్న చిన్న ఇంటి ముందు ఆగింది. గుర్రందిగి, ఇంట్లోకి అడుగు పెట్టాక, విదూషకుడు సునీతాదేవికి చదరంగం ద్వారా తాను ఆమెను రాజుగారి నుంచి ఎలా గెలుచుకున్నదీ తెలియజేశాడు.

నిండుగా తామరపుష్పాలు వికసించి ఉన్నాయి. ''ఆహా! ఎంత అందమైన దృశ్యం!'' అంటూ రాజు ముందుకు నడిచాడు.

సునీతాదేవి మనసులో తళుక్కున ఒక ఆలోచన తోచింది. ''అన్నయ్యా, మీకు కొన్ని తామర పుష్పాలు కోసి ఇస్తాను,'' అంటూ తటాకం ఒడ్డుకుపోయి, ముందుకు వంగి ఒక పువ్వును కోయబోతూ కాలుజారి తటాకంలోకి పడిపోయింది. ముందుగానే వేసుకున్న పథకం ప్రకారం రాజు తిరిగి కూడా చూడకుండా ఏమీ ఎరగనట్టు వెళ్ళిపోయాడు.

సునీతాదేవి చుట్టుపక్కల కలయ జూసింది. అన్న కనిపించలేదు. తను కొలనులో పడిపోయిన సంగతి తెలియక అన్న వెళ్ళిపోయి ఉంటాడని అనుకుని, ''ఎవరైనా వచ్చి కాపా

తనకు తెలియకుండా, తన అనుమతి పొందకుండా, రాజు తనను చదరంగంలో పణంగా పెట్టాడని సునీతాదేవి గ్రహించింది. ఆవేదనచెందింది. అయినా రాజుగారి గౌరవాన్ని కాపాడాలని, "సరే, నేను ఇక్కడే ఉంటాను. అయితే మన వివాహం మాత్రం వచ్చే పౌర్ణమికే," అన్నది.

విదూషకుడు అందుకు అంగీకరించాడు.

సునీతాదేవి ఆక్షణం నుంచే అక్కడి నుంచి తప్పించుకోవడం ఎలాగా అని తీవ్రంగా ఆలోచించసాగింది. పౌర్ణమికి ఇంకా మూడు రోజులు ఉన్నాయనగా, రహస్యంగా ఇంటి నుంచి బయటపడింది. పుట్టినింటికి కాకుండా తిన్నగా భర్త భవనానికి చేరుకున్నది. ఆమె భర్తకేమో ఇక్కడ జరిగిన సంగతులేవీ తెలియవు.

యువరాణి కనిపించక పోవడంతో, విదూషకుడు హడావుడిగా రాజు దగ్గరికి వెళ్ళి సంగతి చెప్పాడు. తన చెల్లెలు భర్త ఇంటికి వెళ్ళి వుంటుందనీ, ఆమెను మళ్ళీ ఇక్కడికి రప్పించడం సాధ్యంకాదనీ రాజు చెప్పాడు. కావాలంటే విదూషకుణ్ణే అక్కడికి వెళ్ళి, మొరపెట్టుకోమని సలహా ఇచ్చాడు.

విదూషకుడు యువరాణి అత్తవారింటికి వెళ్ళాడు. సంగతి తెలియగానే సునీతాదేవి భర్త ఆగ్రహోదగ్రుడయ్యాడు. కేవలం చదరంగంలో తన భార్యను పణంగా పెట్టినందుకు రాజు మీదా, వివాహిత అని తెలిసీ ఆమెను పెళ్ళాడడానికి చూస్తున్న విదూషకుడి మీదా మండిపడ్డాడు. "చదరంగంలో కాదు, చేవ వుంటే ఇప్పుడు నాతో కత్తి యుద్ధం చేసి, జయించి, సునీతను తీసుకువెళ్ళు!" అని విదూషకుడికి సవాలు విసిరాడు. విదూషకుడు అయిష్టంగానేఅందుకు అంగీకరించాడు.

మరునాడే ఇద్దరూ కత్తి యుద్ధానికి సన్నద్ధులయ్యారు. అయితే యుద్ధం అట్టే సేపు జరగలేదు. యువరాణి భర్త కాలు మడతబడి కింద పడడంతో, అతని చేతిలోని కత్తి రెండుగా విరిగి, కొస అతని గుండెల్లోకి గుచ్చుకోవడంతో అక్కడికక్కడే మరణించాడు!

భర్త మరణానికి సునీతాదేవి భోరున విలపించింది. ఆమె విషాదానికి అంతం లేకుండా పోయింది.





ప్రమాద వశాత్తు అతను మరణించాడు. ద్వంద్వ యుద్ధంలో జయిస్తే, తన భార్యనే అప్ప చెబుతానన్న వీరుడికి అలాంటి దుర్గతి పట్టడం దారుణం అనిపించింది. ఇలాంటి రకరకాల ఆలోచనలతో విదూష కుడు వివిధ ప్రాంతాలు తిరిగాడు. ఆఖరికి ఒక పల్లెటూరు చేరాడు. అక్కడొక ఫకీ రును చూశాడు. ఆయన మాటలు విదూషకుడికి ఊరట కలిగించాయి. విచారం నుంచి ఉపశమనం లభిం చింది. మాటల సందర్భంలో ఫకీరు విదూషకుడికి మరణించిన వారిని బతికించవచ్చని చెప్పాడు. మరణించిన సునీతాదేవినీ, ఆమె భర్తనూ బతికించుకునే అవకాశం ఉంటుందన్న ఆశతో, విదూషకుడు తన కథను ఫకీరుకు చెప్పుకున్నాడు. అంతా విన్న ఫకీరు కొంతసేపు మౌనంగా ఆలోచించి, "ఉత్తర దిశగా మూడు యోజనాల దూరం వెళ్ళావంటే ఒక కొండ వస్తుంది. ఆ కొండల మధ్య ఒక గ్రామం వుంది. ఆ మారుమూల గ్రామంలోని కొందరికి చచ్చిన వారిని బతికించే మృతసంజీవనీ మంత్రం తెలుసునని విన్నాను. అక్కడికి వెళ్ళి వారికి సేవలు అందించి వారిని మెప్పిస్తే ఆ మంత్రం నీకు ఉపదేశిం చగలరు," అన్నాడు.

విదూషకుడు ఆ క్షణమే కొండలకేసి బయలుదేరి కొన్నాళ్ళకు అక్కడికి చేరుకు న్నాడు. ఒక గ్రామంలోని ప్రజలు పక్షులను చంపి తినడం - ఆ తరవాత చచ్చిన పక్షి ఈకలనూ, చర్మాన్నీ ఒక చోట చేర్చి ఏదో మంత్రం చెప్పడం మరుక్షణమే చర్మానికీ, ఈకలకూ ప్రాణం వచ్చి పక్షులు ఎగిరి

దుఃఖం ఉపశమించేంత వరకు ఏమీ మాట్లా డకూడదని విదూషకుడు మౌనంగా ఊరుకు న్నాడు. అచారం ప్రకారం సునీతాదేవి భర్తచితి చుట్టూ ఏడు సార్లు ప్రదక్షిణ చేసి చితికి నిప్పంటించింది. మంటలు వ్యాపించగానే, ఆమె పతి వియోగాన్ని భరించలేక మంట ల్లోకి ఉరికి, భర్తతోపాటు సహగమనం చేసింది.

ఈ హఠాత్సంఘటన చూసి విదూషకుడు ఖిన్ను డయ్యాడు. ఆ తరవాత దుఃఖ భారంతో అక్కడ ఉండలేక రాజ్యం వదిలి పెట్టాడు. ఉన్న చోట ఉండలేక దేశదిమ్మరి అయ్యాడు. సునీతాదేవి జ్ఞాపకం వచ్చిన ప్పుడల్లా తనవల్లే ఆమెకీ దుర్గతి పట్టిందని పశ్చాత్తాపంతో దహించుకుపోసాగాడు. తన భర్తపట్ల ఆమె ప్రదర్శించిన విశ్వాసం తలుచు కున్నప్పుడల్లా ఆమెపట్ల అతనికి గౌరవం పెరగసాగింది.

సునీతాదేవి భర్తను తను చంపలేదు.

వెళ్ళడం విదూషకుడు చూశాడు.

ఫకీరు చెప్పిన గ్రామం ఇదే అని గ్రహిం చిన విదూషకుడు ఆ గ్రామంలోనే ఉంటూ, మంచిగా మాట్లాడుతూ వారి కార్యకలా పాలలో పాలుపంచుకోసాగాడు. ఆ గ్రామ స్థులు పక్షులను చంపి తిని, ఆ తరవాత వాటికి ప్రాణం పోయడం విదూషకుడు మళ్ళీ ఒకసారి చూశాడు. అదెలా సాధ్యం అని వాళ్ళను ఆశ్చర్యంతో అడిగాడు.

గ్రామస్థులు అతన్ని ఒక వృద్ధురాలి దగ్గరికి తీసుకు వెళ్ళారు. విదూషకుడి తరఫున గ్రామ స్థుల వేడుకోలును ఆలకించిన వృద్ధురాలు అతనికి మృత సంజీవనీ విద్యను నేర్పడానికి అంగీకరించింది. ఆమె అతన్ని తన గుడిసెలోని చీకటి మూలకు తీసుకుపోయింది. అతను మంత్రాన్ని ఆరుసార్లు వల్లించేలా చేసింది.

విదూషకుడు ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయకుండా, తనరాజ్యానికి తిరుగు ప్రయాణ మయ్యాడు. రాజధానికి చేరి యువరాణి సునీతాదేవి సహగమనం చేసిన స్థలానికి చేరాడు. అక్కడి భస్మరాసిపై నీళ్ళు చల్లి కళ్ళుమూసుకుని మూడుసార్లు మంత్రం జపించాడు. కళ్ళు తెరవగానే సునీతాదేవి ప్రాణాలతో లేచిరావడం చూశాడు.

విదూషకుడు మళ్ళీ కళ్ళు మూసుకుని మూడుసార్లు మంత్రం జపించగానే సునీతాదేవి భర్త కూడా సజీవుడై లేచాడు.

విదూషకుడు పరమానందం చెందాడు. సునీతాదేవిభర్తవిదూష కుణ్ణి సమీపించి, "మాధవా, కత్తి యుద్ధంలో నువ్వు జయిం చావు. కాబట్టి సునీత మీద హక్కు నీకే ఉంది," అన్నాడు.

సునీత నోరువిప్పలేదు. మౌనం వహిం చింది.

ఆమెను చేపట్టడమా? వద్దా? అన్న పెద్ద సమస్య విదూషకుడికి ఎదురయింది.

సరిగ్గా ఆ సమయానికి అటుకేసి వచ్చిన ఫకీరు అతని సమస్యను గ్రహించి, "మాధవా, నువ్వు ఆమెకు ప్రాణం పోశావు. ప్రాణదాత తండ్రితో సమానం. తండ్రిగా నీ కర్తవ్యాన్ని నిర్వర్తించు," అన్నాడు.

ఆ వెంటనే విదూషకుడు సునీతాదేవి చేతిని, ఆమె భర్త చేతిలో పెట్టి, ఒక్క మాట యినా మాట్లాడకుండా అక్కడి నుంచి వెళ్ళి పోయాడు. ఆ తరవాత రాజ్యంలో విదూష కుడి జాడ కనిపించలేదు.



# పాఠకులకు కథల పోటీ
## ఉత్తమ కథకు రూ. 250 బహుమానం



ఈ కింది కథను చదవండి:

రాయదుర్గం అనే పట్టణంలో రామభద్రుడు అనే సంపన్న వర్తకుడు ఉండేవాడు. ఆయన ఇంట్లో చాలామంది సేవకులు ఉండేవారు. వారిలో నారాయుడు ఒకడు. ఇల్లు ఊడ్చి, అన్నిటినీ శుభ్రంగా ఉంచడం అతనిపని.

ఒక రోజు అతడు ఇల్లు ఊడుస్తూండగా ఒక నాణెం కనిపించింది. దానిని తీసి అతడు యజమానికి అప్పగించాడు. "నీ నిజాయితీని మెచ్చాను. ఆ నాణాన్ని నువ్వే బహుమతిగా ఉంచుకో," అన్నాడు రామభద్రుడు.

కొన్నాళ్ళ తరవాత ఇంట్లో ఒక వజ్రాలహారం కనిపించకుండా పోయింది. రామభద్రుడు సేవకులందరినీ విచారించాడు. అయితే, అందరూ దానిని చూడలేదనీ, తాము తీసుకోలేదనీ చెప్పారు. ఆఖరికి ఆయన నారాయుణ్ణి దానిని గురించి అడిగాడు.

యజమానికి, నారాయుడు ఎలాంటి సమాధానం చెప్పి ఉంటాడని మీరు భావిస్తున్నారు?

- నారాయుడు వజ్రాలహారం చూశాడా? లేదా?
- ఒకవేళ చూసి ఉంటే దాన్ని ఏంచేసి ఉంటాడు?
- నారాయుడి సమాధానం విని యజమాని ఏంచేశాడు?
- రామభద్రుడు సేవకుడికి బహుమతి ఇవ్వడం సరైన పద్ధతేనా?

100-150 మాటలతో కథకు ముగింపురాసి మాకు పంపండి. కవరు మీద 'కథల పోటీకి' అని రాయండి. కింది కూపన్‌ను జతచేయడం మరిచిపోకండి.

**కథలు మాకు చేరవలసిన ఆఖరు తేదీ: ఫిబ్రవరి 29, 2004**

పేరు ________________ వయసు ______ పుట్టిన తేదీ ________

పాఠశాల ________________ తరగతి ________

ఇంటి చిరునామా ________________

________________

________________ పిన్‌కోడ్ ________

తల్లి/తండ్రి సంతకం      విద్యార్థి/విద్యార్థిని సంతకం

**చందమామ ఇండియా లిమిటెడ్**

82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097



# సఫలయాత్ర

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించేటప్పుడు బోధిసత్త్వుడు ఒక వర్తక కుటుంబంలో జన్మించాడు. చిన్నప్పటి నుంచీ వర్తకంలోని మెళకువలను పెద్దలనుంచి నేర్చుకున్నాడు. ప్రతి విషయాన్నీ అన్ని కోణాల నుంచీ పరిశీలించి నెమ్మదిగా ఆలోచించి తగిన నిర్ణయాలు తీసుకునే వివేకం పెంపొందించుకున్నాడు. పెద్దవాడై అతను అయిదు వందల బండ్ల మీద సరకు వేసుకుని తూర్పు నుంచి పడమరకూ, పడమర నుంచి తూర్పుకూ తరచూ వెళ్ళి వర్తకం చేసేవాడు. అలా వెళ్ళిన ప్రతిసారీ మంచి లాభాలు గడించేవాడు.

కాశీనగరంలోనే మందమతి అయిన మరొక వర్తకుడు ఉన్నాడు. అతను ఉపాయహీనుడు కూడానూ.

ఒకసారి బోధిసత్త్వుడు తన బండ్ల మీద సరకు వేసుకుని, ప్రయాణానికి సిద్ధంగా ఉండగా, మందమతి ఆయన దగ్గరికి వచ్చి తాను కూడా అదే సమయంలో బయలుదేరుతానన్నాడు.

బోధిసత్త్వుడు మందమతితో, "నీ బళ్ళూ, నా బళ్ళూ ఒక్కసారిగా బయలుదేరితే, దారి ఇరుకై, ప్రయాణానికి ఇబ్బంది కలగవచ్చు. అందుచేత ఒకరి వెనుక ఒకరు బయలుదేరటమే అన్నివిధాలా మంచిది. ముందు నువ్వు బయలుదేరుతావా, లేక నన్ను బయలుదేరమన్నావా? నీ ఇష్టప్రకారమే చేద్దాం," అన్నాడు.

మందమతి తనలో ఇలా అనుకున్నాడు: "ముందు నేను పోయినట్టయితే చాలా లాభాలుంటాయి. దారి నలగదు. ప్రయాణం హాయిగా సాగుతుంది. దారి పొడవునా పశువులకు మంచి పచ్చికా, మనుషులకు మంచి కాయలూ, ఫలాలూ, కూరలూ లభించవచ్చు. నిర్మలమైన నీరు లభ్యమవుతుంది. వెళ్ళిన చోట సరకుల ధరలు నా ఇష్టప్రకారం నిర్ణయించవచ్చు."

బోధిసత్త్వుడు కూడా తనలో ఇలా అనుకున్నాడు:

"అందరికన్నా ముందు వెళ్ళడంకన్నా, ఒకరు తొక్కిన దారిన ప్రయాణించటం తేలిక.



ఒకసారి పశువులు మేసిన చోట గడ్డి మళ్ళీ చిగురు పట్టినప్పుడు రెండింతలు అవుతుంది. కూరగాయలు కూడా అంతే. ముందు వెళ్ళిన వారు నీటి వనరులు ఎక్కడ ఉన్నవో కష్టపడి కనిపెడతారు. లేదా నీటికోసం బావులు తవ్వుతారు. అవి తరవాత వెళ్ళేవారికి ఎంతగానో ఉపయోగపడతాయి. కొత్త చోటికి మొదటి సారిగా వెళ్ళి అక్కడివారితో ధరలను గురించి బేరాలాడటం అంత మంచిది కాదు. ముందు వెళ్ళిన వాళ్ళు నిర్ణయించిన ధరలకు వెనక వెళ్ళేవాళ్ళు ఎలాంటి సమస్యా లేకుండా అక్కడి వారితో చాలా మంచిగా వర్తకం చేసుకోవచ్చు."

ఇలా అనుకుని మందమతి ముందు తాను పోతాననేసరికి బోధిసత్వుడు సంతోషంగా ఒప్పుకున్నాడు.

మందమతి మనసులో ఎంతగానో సంతోషించాడు.

మందమతి వెళ్ళవలసిన చోటు అరవై యోజనాల దూరాన ఉన్నది. మధ్యలో పెద్ద ఎడారి ఉన్నది. దానిని దాటి గమ్యం చేరు కోవాలి. అందుచేత ప్రయాణానికి అవసర మైన తినుబండారాలూ, పీపాలతో తాగటానికి నీరూ సిద్ధం చేసుకుని మందమతి బోధిస త్వుడికి మంచిటోపీ వేశాననుకుని సంతో షంగా బయలుదేరాడు.

మందమతి బిడారు చాలా దూరం ప్రయా ణంచేసి, కొన్నిరోజులకు ఎడారి ప్రాంతం చేరుకున్నది. అందులో కొంత దూరం వెళ్ళే సరికి మందమతికి అపూర్వమైన వాహనం ఒకటి ఎదురయింది. దానికి ఉత్తమజాతి ఎద్దులు, తెల్లనివి, పూన్చి ఉన్నాయి. అందులో ఒక రాజపురుషుడు చాలా ఠీవిగా కూర్చుని ఉన్నాడు. ఆ బండి ముందు సేవకులు కత్తులూ, కటార్లూ, విల్లమ్ములూ ధరించి నడుస్తున్నారు. వెనక మరికొందరు నడుస్తు న్నారు. బండిచక్రాలకు బురద అంటి ఉన్నది. అందరి తలలకూ తామర తూండ్లు చుట్టి ఉన్నాయి. వారి చేతుల్లో తామరపూలు ఉన్నాయి.

రాజపురుషుడు మందమతితో, "ఏం వర్షం! కుంభపోతగా ఒకటే వాన! అదుగో, కనిపిస్తూన్న ఆ అడవి ఆ ప్రాంతమంతా జలమయమే. ఏళ్ళూ, ఊళ్ళూ ఏకమైపోయాయి! అలాంటి వర్షం నా జీవితంలో చూడలేదు. మీరు అటే పోతున్నారుగదా, ఈ పీపాలతో నీరేమిటి? ఎందుకొచ్చిన బరువు? నీరు పారబోసి తేలి కగా వెళ్ళండి," అని సలహా ఇచ్చాడు మందహాసం చేస్తూ.

ఆ రథంలో ఉన్నవాడూ, వాడి వెంటవున్న పరివారమూ నరభక్షకులైన యక్షులు. వాళ్ళు ఇటువైపు వచ్చే ఎడారి ప్రయాణీకులను ఇలాగే మంచి మాటలతో వంచించి, వారు తిండికి మాడి, దాహంతో చచ్చినాక వాళ్ళను హాయిగా పీక్కుతింటారు.

ఈ సంగతి గ్రహించక మందమతి బండ్ల లోని పీపాలన్నీ ఖాళీ చేయించి, ముందుకు కదిలాడు.

దూరాన రాజపురుషుడు చూపిన అడవి కనబడుతున్నదేగాని, ఎంత దూరం వెళ్ళినా అది చేరువకాలేదు. వర్షం కురిసిన ఆనవాలు ఏ మాత్రం కనిపించలేదు.

అందరూ దాహంతో బాధపడుతున్నారు. తాగటానికి నీటిచుక్క కూడా లేదు. గొంతులు ఎండిపోయి సొమ్మసిల్లి ఒక్కొక్కరే మరణించ సాగారు.

క్రమంగా ఎడ్లు కూడా సోలిపోయాయి, చచ్చిన మనుషులనూ, పశువులనూ యక్షులు వచ్చి తినేసి, అస్థిపంజరాలను ఎడారి ఇసుకలో వదిలేశారు.

నలభై అయిదు రోజులు గడవనిచ్చి, బోధిసత్వుడు కూడా తన బిడారుతో అదే తోవన బయలుదేరాడు. అతను కూడా సుదీర్ఘ ప్రయాణానికి అవసరమైన తినుబండారాలూ, పీపాలతో నీరూ బళ్ళల్లో సమకూర్చుకున్నాడు.

వాళ్ళు ఎడారి ప్రాంతం చేరగానే బోధి సత్వుడు తన మనుషులతో, ''నాతో చెప్ప కుండా ఎవరూ ఒక్కచుక్క నీరు పారబో యవద్దు. ఇలాటి ఎడారిలో రకరకాల విష వృక్షాలుంటాయి. కొత్తరకం కాయగాని, ఆకు గాని ఎవరూ తినవద్దు,'' అన్నాడు.

బిడారు కొంత దూరం వెళ్ళేసరికి రాజ పురుషుడు రథం లాంటి తన వాహనంలో



అంతకు ముందు ఎదురుపడి, మందమతితో చెప్పినట్టే చెప్పాడు.

అతనితో బోధిసత్త్వుడు, "మీ దారిన మీరు వెళ్ళండి. చాలా దూరం ప్రయాణం చేయవలసి ఉంది. మేం వర్తకులం. ఇంకో చోట నీరు కనబడితేగాని ఉన్న నీరు పార బోయం. మొదట నీరు కనిపించనీ. కావాలంటే అప్పుడు బరువు తగ్గించుకుంటాం," అన్నాడు.

యక్షుడు ఆ తరవాత ఏమీ చెప్పకుండా మౌనంగా తనదారిన వెళ్ళిపోయాడు.

అతని మాటలు నమ్మి సేవకులు కొందరు నీరు పారబోద్దామన్నారు. బోధిసత్త్వుడు వారితో ఇలా అన్నాడు:

"ఈ ప్రాంతంలో జలాశయం ఏదన్నా ఉన్నట్టు మీరు ఎప్పుడైనా విన్నారా? ఆ మనిషి కుంభపోతగా వర్షం కురిసిందన్నాడు. మనకేసి తడిగాలి ఏమైనా వీచిందా? ఆకాశంలో ఎక్కడైనా మబ్బుతునకలాటిది కనబడుతున్నదేమో చూడండి? మెరుపులు కనబడ్డాయా? ఉరుములు వినబడ్డాయా? మనం చూసిన వాళ్ళు యక్షులు. మనం శోషపడిపోతే తినటానికి ఎత్తు వేశారు. మన ముందు పోయిన వర్తకుణ్ణీ, అతని మనుషులనూ తినేసే ఉంటారు. వాళ్ళ అస్థిపంజరాలు దారిలో మనకు కనబడవచ్చు కూడా!"

అతను చెప్పినట్టే, బిడారు కొంత దూరం వెళ్ళేసరికి, మందమతి తాలూకు అయిదు వందల బళ్ళూ, వాటిలోని వర్తక సరుకులూ కనిపించాయి. వాటి చుట్టూ మనుషులవీ, పశువులవీ అస్థిపంజరాలు చెదురు మదురుగా పడి ఉన్నాయి. ఆ దృశ్యం చూడడానికి చాలా బీభత్సంగా ఉంది.

"చూశారా? మందమతి దూరాలోచన చెయ్యక, ఎవరో చెప్పిన మాటలు నమ్మి నీరు పారబోసుకోవటం వల్ల ఏం జరిగిందో?" అన్నాడు బోధిసత్త్వుడు.

ఆ ప్రాంతంలోనే ఆ రాత్రి మజిలీ చేసి, బోధిసుత్త్వుడు, మర్నాడు ఉదయం, చచ్చి పోయిన వర్తకుడి బళ్ళలో చెడిపోనివీ, సరుకులలో బాగా ఉన్నవీ తన వెంట తీసుకుని గమ్యస్థానానికి వెళ్ళి, లాభసాటిగా తన దేశానికి తిరిగి వచ్చాడు.

ఈ ప్రయాణంలో అతనికి ఒక్క ప్రాణి కూడా నష్టం కాలేదు.





# విష్ణు కథ

సత్యవ్రతుని మాటలు విని చేప సముద్ర మధ్యానికి చేరి, మహాపర్వతంలాగ సాగరం పొడవునా పెరిగి, "సత్యవ్రతా! నీ వాక్కు అమోఘంగా పని చేసింది. చూశావా! ఇంకా పనిచేస్తూనే ఉంది. ఇలా ఇంకా, ఇంకా పెరిగి పెరిగి ఏమైపోతానో!" అన్నది.

అప్పుడు సత్యవ్రతుడు రెండు చేతులెత్తి మొక్కుతూ, "మత్స్యరూపంలో ఉన్న ఓ నారాయణుడా! రక్షణ కోరుతున్నట్టే వచ్చి, నన్ను రక్షించడానికే మత్స్యావతారం ఎత్తావు. నీ లీలలు తెలుసుకోవడానికి నేనేమాత్రం!" అంటూ ఎన్నో విధాల స్తుతించాడు.

అప్పుడు మత్స్యావతారంలో ఉన్న విష్ణువు, "ఓ రాజా! ఏడు దినాలకు కల్పాంతం కాబోతున్నది. ప్రళయ జలాల్లో అంతా మునిగిపోతుంది. జ్ఞానం, ఓషధులు, విత్తులు నశించకూడదు. ముందొచ్చే కల్పానికి అవి లేకపోతే ఎలాగ? అందుచేత అవి రక్షింపబడాలి. నీ కోసం పెద్ద నౌక గాఢాంధకారంలో దీపంలాగ వెలుగుతూ వస్తుంది. అందులో సప్తర్షులు ఉంటారు, ఆ వెలుగు వారిదే!

ఓషధుల్నీ, విత్తనాల రాసుల్నీ, నీతో బాటు నౌకలోకి చేర్చు! నా మీద ఉండే కొమ్ము చివరతో, మీరుండే నావను పట్టి ఉంచి మునిగిపోకుండా అన్ని విధాలా నేను రక్షించుతూ, ఉంటాను. అందుకే నేను ఇలాగ అవతరించాను. బ్రహ్మమేల్కాంచేవరకూ నావ ధ్రువుణ్ణి దిక్సూచిగా పెట్టుకొని పయనిస్తూంటుంది. రాబోయే కల్పంలో నువ్వు వైవస్వతుడు అనే పేరున మనువుగా ఉంటావు!" అని ఆదేశించాడు.

సత్యవ్రతుడు విష్ణువు ఆనతిని తల దాల్చి వినమ్రుడై మొక్కాడు. మత్స్యావతారం నాలుగు రెక్కలు ఊపుతూ, తోకతో త్రుళ్ళగొడుతూ,



ఉవ్వెత్తున లేస్తున్న కెరటాలను చీల్చుకొని, సముద్రంలోకి వెళ్ళింది.

బ్రహ్మ మంచి నిద్ర తీస్తున్నాడు. అంధకారంలో విలయకాండ జరుగుతూన్నది.

హయగ్రీవుడు అనబడే సోమకాసురుడు తలాతలం నుండి సముద్రం మీదకు వచ్చి, గబ్బిలంలాగ బ్రహ్మ ఉండే సత్యలోకానికి ఎగిరాడు.

నిద్ర వచ్చి బ్రహ్మ ఆవులిస్తున్నప్పుడు, అతని నాలుగు ముఖాల నుండి తెలుపు, ఎరుపు, పసుపు, నీలం రంగుల్లో ప్రకాశిస్తున్న నాలుగు వేదాలు వెలుపలికి వచ్చి పక్కనే పడి ఉన్నాయి. హయగ్రీవుడు వాటిని తస్కరించుకొనిపోయి, సముద్రం అట్టడుగు శిలల పొదల్లో దాచాడు.

హయగ్రీవాసురుడు దేవతలకు, విష్ణువుకు ప్రబల విరోధి. వేదాలు లేకుండా బ్రహ్మ సృష్టి చేయలేడు. కల్పకల్పానికి మంచినీ, ప్రగతినీ పెంపొందించాలనే విష్ణువు సంకల్పం చెడగొట్టడమే వాడి ఉద్దేశం.

ప్రళయ సముద్రం భూమిని ముంచుతున్న సమయంలో, ఎదురు చూస్తూన్న సత్యవ్రతుడికి అంధకారంలో దూరంగా చిన్న వెలుగు, చుక్కలా కనిపించి పెద్దదౌతూ సమీపిస్తున్నది; అదే సప్తర్షుల కాంతితో నిండిన నావ!

ఓషధులనూ, నానావిధ బీజ సంపదనూ నౌకలోకి చేర్చి సత్యవ్రతుడు అత్యంత భక్తితో నారాయణ సంకీర్తనం చేస్తూ నావలో ప్రయాణిస్తున్నాడు. మత్స్యావతారం ముక్కుపై నిలువుగా పెద్ద కొమ్ము ఉంది. నక్షత్రంలాగ మెరుస్తున్న ఆ కొమ్ము చివరను చుట్టుకొని ఒక మహాసర్పం పెద్ద త్రాటితో కట్టినట్లు ఓడను కలిపి పట్టుకొని, పడగవిప్పి ప్రళయ ప్రభంజనాలను పీల్చి దిగమ్రింగుతూన్నది. మత్స్యావతారం తన రెక్కలతో కెరటాలను తూలగొడుతూ సముద్రాన్ని చీల్చుకొని, నావను భద్రంగా తీసుకెళుతూన్నది. ధ్రువతార గుర్తుగా నౌక పువ్వులాగ తేలుతూ పయనిస్తూన్నది.

సముద్రం అడుగున దాచిన వేదాలను కాపలా కాస్తూ సోమకాసురుడు సముద్రం లోపల తిరుగుతున్నాడు. నాలుగు వేదాలు నలుగురు శిశువులుగా మారి క్యారుమంటూన్న ఆర్తనాదం లీలగా వినవస్తున్నది.

మత్స్యావతారం వేదాలను వెతుకుతూ వెళ్ళింది.

మహామత్స్యాన్ని చూసి సోమకాసురుడు భీతిల్లుతూనే మొండిధైర్యంతో ముళ్ళగదనెత్తి ఎదుర్కొన్నాడు. అప్పుడు విష్ణువు నడుము

వరకు మత్స్యంగా చతుర్బాహువులతో అవతరించాడు. మత్స్యమూర్తికీ, సోమకాసురుడికీ ఘోరసంగ్రామం జరిగింది.

సోమకాసురుడు సముద్రం అట్టడుగు చేరి పారిపోతూంటే విష్ణువు చక్రం ప్రయోగించి వాణ్ణి ముక్కలు ముక్కలుగా నరికి హత మార్చాడు.

విష్ణువు పసిబిడ్డల రూపంలో ఉన్న వేదాలను ఎత్తుకొని, ఇద్దరేసి పిల్లల్ని చెరో సందిట చేర్చుకొని నీటి మీదికి వచ్చాడు. పిల్లలు విష్ణువు కంఠహారంలోని శ్రీవత్స, కౌస్తుభ మణులను చిట్టి చేతులతో ఆడుకుంటూ కిలకిలా నవ్వుతూ కేరింతాలు కొడుతున్నారు. నలుగురు పిల్లలూ తెలుపు, ఎరుపు, పసుపు, నీలం కాంతితో మెరుస్తున్నారు. విష్ణువు మీది చేతుల్లో శంఖచక్రాలు దివ్య తేజస్సుతో ప్రకాశిస్తున్నవి.

విష్ణువు మత్స్యావతార మూర్తిని చూసి ఋషులు, సత్యవ్రతుడు మహదానందంతో మైమరిచి చేతులెత్తి మ్రొక్కుతూ స్తోత్రం చేశారు. ప్రళయసముద్రం శాంతించి భూభాగం ఏర్పడుతూన్నది; నౌక క్రమంగా గమ్యం చేరుకొంది.

బ్రహ్మకు పగటి ప్రమాణం ఎంతో రాత్రీ అంతే. అతని నిద్రాకాలం పూర్తికావస్తున్నది. సరికొత్త కల్పం ఆరంభమౌతూన్నది.

సరస్వతీదేవి ముందుగా లేచి వీణ సవరించి భూపాలరాగాన్ని పలికిస్తూన్నది. బ్రహ్మ మేలుకొని నాలుగు తలల్లో ఏదో కలత, వెలితి అనిపించి పరికించి చూస్తే వేదాలు లేవు! వేదాలు పోగొట్టుకొని దిగులుగా ముఖాలు వేలాడదీసుకుని విచారిస్తుండగా, విష్ణువు



మత్స్యావతారంతో వేదాలను తెచ్చి అతనికి ఇచ్చాడు.

బ్రహ్మ విష్ణువు మత్స్యావతార రూపాన్ని కన్నుల పండుగగా తిలకించి చేతులు జోడించి నాలుగు నోళ్ళతో కీర్తించాడు. "ఓ నారాయణా! నీ మత్స్యావతారాన్ని ధ్యానించిన వారికి ప్రళయంలాగ విరుచుకు వచ్చిన ఆపదలన్నీ తొలగిపోతవి, అజ్ఞానాంధకారం పటాపంచలౌతుంది!" అని బ్రహ్మ అన్నాడు.

మత్స్యావతారం ఎత్తిన కార్యం పూర్తిగా నెరవేరింది. విష్ణువు అంతర్థానమై, తన నివాసమైన వైకుంఠాన్ని చేరాడు.

బ్రహ్మ వేదాలు తీసుకొని ఉత్సాహంతో సృష్టిమొదలుపెట్టాడు. కొత్తకల్పానికి వివస్వంతుడనే పేరున ఉదయించిన సూర్యుడికి పుత్రుడుగా సత్యవ్రతుడు శ్రార్ధ దేవుడు -వైవస్వతుడు అనే పేరున మనువైనాడు. సప్తఋషులు ఆకాశానికి చేరుకొని తమ



తమ స్థానాల్లో సప్తర్షిమండలంగా ప్రకాశిస్తూ ధ్రువునికి ప్రదక్షిణం చేస్తూ, తిరగసాగారు - అని సూతుడు చెప్పగా మునులు, "సూత మునీంద్రా! ధ్రువుని చరిత్ర వినగోరుతు న్నాము!" అన్నారు.

సూతుడు ఇలా చెప్పసాగాడు:

ఈ మహా విశ్వంలో ఉన్నతోన్నతమైన స్థానమే ధ్రువమండలం. అదే విశ్వస్వరూ పుడైన విష్ణు శిరస్సుండే తావు.

అంతటి అత్యున్నత పదాన్ని పొందిన ధ్రువుడు ఉత్తానపాదుడు అనే రాజు కొడుకు. ధ్రువుడి తల్లి సునీతి ఉత్తానపాదుడి పెద్ద భార్య, సురుచి చిన్న భార్య. రాజుకు చిన్న భార్య సురుచి మీద మక్కువ ఎక్కువ.

ఒకనాడు ఉత్తానపాదుడు సురుచికొడుకు ఉత్తముణ్ణి తన తొడపై కూర్చో బెట్టుకొని ముద్దుచేస్తుండగా, ధ్రువుడు అక్కడకు వచ్చి, తాను కూడా తండ్రి తొడపై కూర్చోవాలని తండ్రి దగ్గిరగా చేరి ఎంతో ఆశతో చూశాడు.

సురుచి అక్కడే ఉన్నది. రాజు ఆమెకు జడిసి ధ్రువుణ్ణి చూసీచూడనట్టు ఊరుకు న్నాడు. తమ్ముణ్ణి కూర్చోబెట్టుకొన్నట్లే తండ్రి తన్ను కూడా ఎత్తి కూర్చోబెట్టుకుంటాడని ఆశించిన ధ్రువుడు బిక్కమొహం వేసి గుడ్ల నీరుపెట్టుకొన్నాడు. పసివాడి బుగ్గలపై కన్నీటి ముత్యాలు మెరిశాయి.

అది చూసి సురుచి ఫక్కున నవ్వి, "దిక్కు మాలిన దానికి పుట్టినవాడా! నువ్వు ఎంత తపస్సుచేసినా, నా కొడుకుతో సమానంగా తండ్రి తొడ మీద కూచునే యోగం నీకు అబ్బదురా, అబ్బీ! నా కడుపున పుట్టాలి; నీకా భాగ్యం కలగాలి! అంతే! అన్నట్టు నువ్వు మహా గొప్పగా నారాయణ సంకీర్తనం చేస్తూం టావేమో, తపస్సు చేసి, ఆ భాగ్యం కల్గిస్తాడేమో ఆ నారాయణుడినే అడిగి చూడు," అని హేళన చేసింది.

పసివాడి మనస్సు కుతకుతలాడింది; దుఃఖం పెల్లుబికింది, ఉక్కురోషం ముంచు కొచ్చింది. కొరడా తీసుకొని సురుచిని చావ బాదాలనిపించింది. కత్తితో నిలువునా చీరె య్యాలనిపించింది. మరుక్షణంలోనేసురుచి, "నాయనా! నారాయణుడిని నమ్ముకో! తపస్సు చెయ్యి," అని ఉపదేశించిన, సద్గురువులాగ కనిపించింది. అంతటి మహత్తరమైన ఉప దేశానికి నోచుకోని ఉత్తముడు అభాగ్యుడైన వట్టి అమాయకుడిలాగ కనిపించాడు. ఉత్తాన పాద మహారాజు చీకటివలలో చిక్కుకొని బిక్కుబిక్కుమంటున్న దుప్పిలాగ కని పించాడు.

ధ్రువుడు సురుచికి గురూపదేశం పొందిన శిష్యుడిలాగ నమస్కరించి, అక్కడినించి

వెళ్ళాడు. ధ్రువుడి చేష్ట అర్థం కాని సురుచి మొదట నివ్వెరపోయింది. తరువాత, "కుర్రాడు మంచి వాడే! నాలుగు తిట్టినా మ్రొక్కుతూ వెళ్ళాడు, ఐనా మ్రొక్కకేం జేస్తాడు, నా ఎదట నోరు మెదపడం వాడి తరమా? వాడి తల్లి తరమా?!" అని అమితగర్వంగా తనలో తాను విపరీతంగా పొంగిపోతూ సరిపెట్టుకుంది.

కన్నీటి చారలతో వచ్చిన ధ్రువుణ్ణి చూసి జరిగింది దాసీలవల్ల విన్న సునీతి బావురుమంటూ, "ఔను, నాయనా! దాసీ దానికన్న హీనంగా బతుకుతున్న నా కడుపున ఎందుకు నువ్వు పుట్టాలి? నలుగురెదుట అవమానపడాలి? నీ సవతి తల్లి మాటలు ముమ్మాటికీ నిజం, నీకూ నాకూ ఆ నారాయణమూర్తి తప్ప వేరే దిక్కులేదు!" అన్నది. ఆ మాటలకు ధ్రువుడు ధైర్యంగా లేచి నిలబడి, "అమ్మా! నేను తపస్సుకు వెళ్తున్నాను!" అన్నాడు.

"ఏమిటీ! తపస్సు చేస్తావా? సురుచి కడుపున పుట్టాలని వరంకోరుకో!" అన్నది సునీతి.

"అమ్మా ఆగు! మళ్ళీ ఆ మాటే అనకు; నేను నీ కొడుకును. మరెవరికో కొడుకునై పుట్టాలని ఎందుకు కోరతాను? మనల్ని మనం తక్కువ చేసుకోకూడదు. అది ఆత్మహత్యతో సమానం. ధ్రువుడి తల్లి ఎంత భాగ్యశాలి అనేలాగ, దిక్కులకు దిక్కుగా ఉండేలాగ నారాయణుణ్ణి కోరుకుంటాను, వస్తాను!" అని చెప్పి ధ్రువుడు బయలుదేరాడు.

నారదుడు ఎదురుగా వస్తూ, "ఓ హెూ, ధ్రువకుమారా! ఆడుకోడానికి బయలుదేరినట్టుంది, ఔనా?" అన్నాడు.



"తపస్సుకు వెళ్తున్నాను, స్వామీ!" అన్నాడు ధ్రువుడు.

"తపస్సు అనే ఆట ఒకటి ఉందన్న మాట, అలాగే చక్కా ఆడుకో నాయనా!" అన్నాడు నారదుడు.

"ఆటకాదు. నిజంగానే శ్రీమన్నారాయ ణుణ్ణి గూర్చి తపస్సు చేయడానకి వెళుతు న్నాను. మునీంద్రా," అన్నాడు ధ్రువుడు.

"అలాగా! ఇంత పసిప్రాయంలో ఏమి కోరి తపస్సు చేయబోతున్నావు?" అని అడి గాడు నారదుడు ఆశ్చర్యంగా.

"మా తండ్రి తొడ మీద కూర్చోబోతే, మా సవతి తల్లి అడ్డుపడి హేళనగా మాట్లాడింది," అంటూ జరిగింది వివరించాడు ధ్రువుడు.

"అదా సంగతి, ఓష్! ఈమాత్రం దానికి తపస్సెందుకోయి ధ్రువా! నాతో రా, నీ తండ్రి నిన్ను తొడ మీద ఎందుకు కూర్చోబెట్టుకోడో చూస్తాను!" అన్నాడు నారదుడు.

"ఎవరి దయాధర్మాలూ నాకు వద్దు, స్వామీ! అన్నిటికంటె ఉన్నతమైన నారాయణుని అను గ్రహం నాకు కావాలి! అందుకే తపస్సు చేయ డానికి వెళ్తున్నాను!" అన్నాడు ధ్రువుడు.

"తపస్సంటే మాటలు కాదు, నాయనా! అరణ్యంలో పులులు, సింహాలు మొదలైన క్రూర మృగాలుంటాయి. ఎండా వానా చలీ అన్నీ బాధగానే ఉంటాయి. నా మాట విను, తిరిగి ఇంటికి పద!" అన్నాడు నారదుడు.

నారదుడి మాటలకు ధ్రువుడు, "నేను క్షత్రియుణ్ణి, పరాభవం సహిస్తూ బతకలేను. నాకు పిరికిమందు నూరిపోయడానికివచ్చారా, స్వామీ?" అన్నాడు వినయంగా.

"నాయనా, ధ్రువా! నీ దీక్ష తెలుసుకోడా నికే అలాగ అన్నాను. ఒకప్పుడు నేను కూడా దిక్కులేని బాలుడనై ఎన్నెన్నో అవమానాలూ, అగచాట్లూ పడి అడవి చేరి తపస్సు చేసిన వాడినే! నువ్వు మధువనానికి వెళ్ళి, 'ఓం నమో నారాయణ' అని జపిస్తూ తపస్సు చెయ్యి. నిన్ను ఆశీర్వదిస్తున్నాను, కృతార్థు డివై రా!" అని నారదుడు అన్నాడు-ధ్రువుడు ఉత్సాహంగా మధువనం కేసి నడవసాగాడు, అని సూతుడు చెప్పగా విన్న మునులు, "మునీంద్రా! నారదుడు ఎందుకు అగచాట్లు పడ్డాడు? నారదుడి వృత్తాంతం వినాలని కుతూహలంగా ఉంది!" అన్నారు.



## వివిధ దేశాల కథలు



# ఇంగ్లాండ్ జానపద కథ
# యక్షిణులతో బేరం

వేల్స్ సముద్రతీరంలో మిల్‌ఫోర్డ్ హావన్ అనే చిన్న పట్టణం ఉండేది. అక్కడి ప్రజలు చాలా ప్రశాంత జీవనం గడిపేవారు. అలాంటి ప్రజలకు హఠాత్తుగా కొన్ని విచిత్ర అనుభవాలు కలగడంతో ఆందోళనకు లోనయ్యారు. పట్టణంలోని దుకాణాలనుంచి వ్యాపారుల కళ్ళెదుటే సరుకులు మాయం కాసాగాయి. వాటి స్థానంలో బంగారు నాణాలు కనిపించేవి.

ఒక రోజు, గ్రిఫిత్ అనే ఒక దుకాణందారు, ఆఖరి ఖాతాదారు కూడా వెళ్ళడంతో ఆనాటి వ్యాపారం ముగించి, నుదుటి చెమట తుడుచుకుంటూ గోడవారగా కూర్చోబోయాడు. అప్పుడు ఆయన పక్కనేవున్న పెద్ద గుమ్మడి కాయ మాయం కావడం చూసి దిగ్భ్రాంతి చెందాడు. మరుక్షణమే అక్కడ కొన్ని బంగారు నాణాలు చూసి మరింత ఆశ్చర్య పోయాడు. గ్రిఫిత్ వాటిని తీసి చూశాడు; నాణాలు తళతళా మెరుస్తున్నాయి. వాటి

MAHE...

పక్కనే ఒక చిన్న బంగారు దండం కూడా కనిపించింది. చుట్టు పక్కల కలయ చుశాడు. రద్దీగా ఉన్న ఈ దుకాణం వీధిలో దానిని ఎవరు పోగొట్టుకున్నారో కనుగొనలేకపోయాడు. దానిని తీసి, నాణాలతో పాటు తన జేబులో భద్రపరిచాడు.

మరుక్షణమే అతని కళ్ళకు వింత వింత దృశ్యాలు కనిపించసాగాయి. ప్రకాశవంతమైన రంగు రంగుల దుస్తులు ధరించిన బుడత జీవులు హడావుడిగా అటూ ఇటూ తిరుగుతూ కనిపించారు. ఒక్క నిమిషం క్రితం వాళ్ళక్కడలేరు. అంతలో ఇంత మంది ఎక్కడినుంచి వచ్చారు అని అతడు ఆశ్చర్యపోయాడు. వాళ్ళందరూ సరుకులను కొనుక్కుంటూన్నట్టు కనిపించింది. అతడు తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు. కలగనడం లేదు కదా అని గ్రిఫిత్ ఒకసారి, తన చేతిని గిల్లి చూశాడు. కళ్ళు తుడుచుకుని మళ్ళీ పరిశీలనగా చూశాడు.

ఆ బుల్లి ప్రాణులను తను మాత్రమే చూస్తున్నట్టు అతడు కొంతసేపటికి గ్రహించాడు. "నాకు దొరికిన ఈ బంగారు దండం కారణంగానే ఈ యక్షిణులను చూడగలుగుతున్నాను!"



అని అతడు ఊహించాడు. ఆ యక్షిణులు అక్కడి దుకాణాలలోని తమకు కావలసిన సరుకులను, ఫలాలనూ, కాయగూరలనూ తీసుకోవడం; వాటి స్థానంలో బంగారు నాణాలను జారవదలడం గ్రిఫిత్ చూశాడు.

ఇప్పుడు అర్థమయింది అతనికి అసలు సంగతి. "పట్టణంలో జరుగుతూన్న మాయాజాలాలన్నిటికీ కారణం మీరన్న మాట! మీ మూలంగానే వస్తువులు మాయమై పోతున్నాయి. నాణాలు ప్రత్యక్షమవుతున్నాయి!" అనుకున్నాడు. అతడు సమర్థుడైన వ్యాపారి గనక యక్షిణులు ఎలాంటి వస్తువులను మాయం చేస్తున్నాయో, వాటికి ఇష్టమైన వస్తువులేమిటో తృటిలో పట్టేశాడు.

మరునాడు అలాంటి వస్తువులనే సేకరించి, దుకాణం దగ్గర కూర్చున్నాడు. దుకాణంవీధి వ్యాపారంతో రద్దీగా ఉన్నప్పుడు, యక్షిణులు వచ్చాయి. అవి తిన్నగా గ్రిఫిత్ దుకాణానికి వచ్చి తమకు కావలసిన అక్కడి వస్తువులన్నిటినీ తీసుకున్నాయి. అవి దుకాణం వదిలి వెళ్ళేప్పుడు గ్రిఫిత్ పక్కన చాలా బంగారు నాణాలు పడ్డాయి. అలా తరచూ యక్షిణులు అతని దుకాణానికిరావడంతో, కొన్నాళ్ళకు అతడు గొప్పధనికుడయ్యాడు.

ఒకనాడు వర్తకుడు సముద్రతీరంలో నడిచి వెళుతూండగా, దూరంలో అతనికొక దీవి కనిపించింది. యక్షిణులు వాటికేసి ఎగిరి వెళ్ళడం అతడు గమనించాడు. "ఆహా, యక్షిణుల నివాసస్థలం ఆ దీవి అన్నమాట! ఈ దండం పుణ్యమా అని వాటిని స్పష్టంగా చూడ కలుగుతున్నాను," అనుకున్నాడు సంతోషంగా.

ఆ క్షణం నుంచే అతని మనసులో రకరకాల ఆలోచనలు రాసాగాయి. ఇల్లు చేరేలోగా, యక్షిణులతో వ్యాపారాభివృద్ధి చేసుకుని, అతి త్వరలో మరింత ధనికుడు కావాలని ఒక

పథకం ఆలోచించాడు. "సరుకులతో తిన్నగా యక్షిణుల దీవికి వెళతాను. అక్కడ నా సరుకులు కొనడానికి మరింత మంది వస్తారు. మరిన్ని సరుకులు అమ్మి, మరింత పెద్ద ధనికుడై పోయి, సాటిలేని వర్తకుడని పించుకుంటాను," అనుకున్నాడు.

మరునాడే, యక్షిణులు కొనే సరుకులతో ఒక పడవలో దీవికేసి బయలుదేరాడు. అక్కడికి చేరగానే, తన సరుకులను దీవిలోకి చేర్చాడు. వర్తకుణ్ణి చూడగానే, ఒక మానవుడు తమ దీవిలో అడుగు పెట్టడం చూసి యక్షిణులు దిగ్భ్రాంతి చెందాయి. క్షణాలలో ఆ ప్రాణులన్నీ కొత్త ఆగంతకుణ్ణి చూడడానికి తీరంలో గుమి కూడాయి. వాటిని చూసి వర్తకుడు ఎంతో ఆనందించాడు. "మిత్రులారా, రండి! మీ కోసం ఏం తెచ్చానో చూడండి! రోజూ మిల్ఫోర్డ్‌హావన్‌కు వెళ్ళి సరుకులు కొనవలసిన అవసరంలేదు. మీకు కావలసిన వాటిని మీ దగ్గరికే తెచ్చాను. రండి, చూడండి," అని వాటిని పిలిచాడు.

సరిగ్గా ఆ సమయానికి అక్కడికి వచ్చిన యక్షిణుల నాయకుడు, గ్రిఫిత్ ఆహ్వానాన్ని విన్నాడు. ఒక్కక్షణం ఆలోచించి యక్షిణులతో, "మీరేం భయపడకండి. ఈ మనిషిలో ఆశ పెరిగిపోయింది. అతని అత్యాశే అతన్ని హరి స్తుంది. అతనికి పతనం తప్పదు. అయితే, అతని మనసులో ఉన్న ఆలోచనలు మనం గ్రహించినట్టు అతనికి తెలియకూడదు. మీకు కావలసినవాటిని అతనివద్ద కొనుక్కోండి. ప్రతి రోజూ రమ్మని అతనికి చెప్పండి. ఏం చెయ్యాలో తరవాత చెబుతాను," అన్నాడు.

యక్షిణులు గ్రిఫిత్ వద్దకు వెళ్ళి, కావలసిన వాటిని కొనుక్కున్నాయి. "రేపు ఇదే సమయా నికి, ఇక్కడికే రా," అన్నది ఒక యక్షిణి తన పథకం విజయవంతమైందన్న సంతోషంతో



ఉబ్బి తబ్బిబ్బవుతున్న గ్రిఫిత్‌తో.

అతడు వెళ్ళిపోయాక, నాయకుడు యక్షిణు లతో, "అతడు ఇక్కడికి వచ్చేప్పుడు, మానవుల కంట బడని, మన దీవినీ, మన రూపాలనూ ఎలా చూడకలుగుతున్నాడో తెలుసుకోవాలి. అతడికిలాగే ఇతరులకు కూడా మన రహస్యం తెలిసిపోతే మనం ఇక్కడ ప్రశాంతంగా ఉండ లేము," అన్నాడు.

మరునాడు గ్రిఫిత్ రాగానే, అతనికి యక్షిణులు ఘన స్వాగతం పలికాయి. "ఇవాళ నువ్వు తెచ్చిన కూరగాయలు చాలా తాజాగా ఉన్నాయి," అన్నది ఒక అందమైన యక్షిణి.

"అలాగా!" అన్నాడు గ్రిఫిత్ ఆనందంతో.

"అవునూ, మేము మనుషులకు కనిపించం అనుకునే దాన్ని. నువ్వెలా మమ్మల్ని చూడ గలుగుతున్నావు?" అని అడిగింది నవ్వుతూ.

"ఒక రోజు నా దుకాణానికి వచ్చిన మీ వారె వరో, ఒక బంగారు దండాన్ని అక్కడ వదిలి వచ్చారు. దానిని నా చేతిలోకి తీసుకోగానే

మీరందరూ కనిపించసాగారు,'' అన్నాడు గ్రిఫిత్.

''ఆ దండాన్ని కాస్త చూపుతావా?'' అని అడిగింది యక్షిణి.

గ్రిఫిత్ జేబులో నుంచి ఆ మంత్రదండాన్ని తీశాడు. దానిని ఆ యక్షిణి తన చేతిలోకి తీసుకుని అటూ ఇటూ తిప్పి చూస్తూ, ''అరరే, ఇది డైసీది. కొన్నాళ్ళ క్రితం ఎక్కడో పోగొట్టుకుని, డైసీ దీనికోసం తెగ వెతికింది. కనిపించలేదు,'' అనుకుంటూ, తిప్పి ఇచ్చేసింది.

ఆ తరవాత యక్షిణి దానిని గురించి మిత్రులకు చెప్పింది. యక్షిణులు దానిని గ్రిఫిత్ నుంచి తిరిగి తీసుకోవడానికి పథకం ఆలోచించాయి.

మరునాడు వర్తకుడు దీవికి వచ్చి సరుకులు అమ్మాక, నిన్న చూసిన అందమైన యక్షిణి అతని దగ్గరికి వెళ్ళి మంచిగా మాట్లాడి, తన వెంట వస్తే దీవిని చూపుతానని చెప్పింది. వర్తకుడు సరేనని బయలుదేరాడు. దీవిలో ఎక్కడ చూసినా, మణులు, మాణిక్యాలు, వజ్రాలు, వైడూర్యాలు. ఇళ్ళు కూడా నవరత్నాలతో నిర్మించబడి ఉన్నాయి. వాటిని చూడగానే గ్రిఫిత్ కళ్ళు చెదిరాయి. వాటన్నిటినీ తనకే సొంతం చేసుకోవాలనుకున్నాడు.

అతడి మనసులోని కోరికను కనిపెట్టిన యక్షిణి, ''కావాలంటే, నీకు కావలసినంత తీసుకెళ్ళవచ్చు,'' అని కొంత సేపు ఆగి, ''అయితే, నువ్వు దానికి బదులుగా మాకేదైనా ఇవ్వాలి,'' అన్నది.

''ఏం కావాలి?'' అని అడిగాడు గ్రిఫిత్ ఆత్రంగా.

''అదేం అంత గొప్పదేం కాదు,'' అని కొంతసేపు ఆగి, ''నిన్న నాకు చూపావే ఒక బంగారు దండం, దాన్నిస్తే చాలు,'' అన్నది యక్షిణి ఏమాత్రం ఆసక్తి లేనట్టు నటిస్తూ.

గ్రిఫిత్ వెంటనే అంగీకరించాడు. రకరకాల మణులు, మాణిక్యాలు, వజ్రవైడూర్యాలు గుట్టలు గుట్టలుగా ఉన్న చోటికి యక్షిణి అతన్ని వెంటబెట్టుకు వెళ్ళింది. గ్రిఫిత్ తనకు కావలసినన్నింటిని తీసి తన పడవలోకి చేర్చాడు. ఆ తరవాత, బంగారు దండాన్ని ఆ యక్షిణి చేతికిచ్చి, తిరుగు ప్రయాణమయ్యాడు.

అతడు పడవలోకి చేరి కొంత దూరం వెళ్ళేసరికి, పడవలోని మణులు కొద్దికొద్దిగా తగ్గడం గమనించాడు. సంగతేమిటని యక్షిణిని అడగడానికి వెనక్కు తిరిగి చూశాడు. ఒక్క యక్షిణీ కనిపించలేదు. ఆగ్రహావేశంతో ఊగిపోతూ అరిచాడు. కానీ, అంతలో అక్కడ యక్షిణుల దీవికూడా కనిపించలేదు. బంగారు దండం లేకుండా తాను యక్షిణులను చూడలేనన్న సంగతిని అతడు అప్పుడు గ్రహించాడు.

ఒట్టి చేతులతో, చెప్పరాని బాధతో ఇల్లు చేరిన గ్రిఫిత్‌కు ఆతరవాత ఎన్నడూ యక్షిణులు కనిపించలేదు!





# క్లిష్టమైన ప్రశ్న - చక్కని జవాబు

గొప్ప పండితుడుగా అందరి చేతా కొనియాడ బడే చిత్రానందస్వామి, చాలా కాలంగా గ్రామ సీమలకు దూరంగా, ఒక సెలయేటి ఒడ్డున గల ఒక అందమైన ఉద్యానవనంలో విద్యాపీఠం నిర్వహిస్తున్నాడు.

ఆయన పదిహేనేళ్ళ వయసులో, విద్యా పిపాసకొద్దీ, అనేక ప్రాంతాలు తిరిగి, ఎందరో పండితుల వద్ద విద్యాభ్యాసం చేసి, చివరకు యాభై ఏళ్ళు నిండుతుండగా, నవద్వీపం నుంచి తిరిగి వచ్చాడు.

ఆయన నడుపుతూన్న సుప్రసిద్ధమైన ఆ గురుపీఠంలో ప్రవేశం దొరకడం సామాన్యమైన విషయం కాదు. అక్కడ ఐదేళ్ళపాటు శిక్షణ పొంది బయటికి వచ్చిన విద్యార్థులకు ఏ ఆస్థానంలో అయినా సులభంగా మంచి ఉద్యోగం దొరికేది.

ఆ కారణం వల్ల, చుట్టుపక్కల గ్రామాల నుంచే కాకుండా, ఎందరో విద్యార్థులు చాలా దూర ప్రాంతాల నుంచి, చిత్రానంద స్వామి గురుపీఠంలో విద్య నభ్యసించేందుకు వచ్చే వారు.

తన దగ్గర శిక్షణ పొందడానికి వచ్చే విద్యార్థుల తెలివితేటలనూ, సమయస్ఫూర్తినీ పరీక్షించటానికి, ఆయన వారికి కొన్ని పరీక్షలు పెట్టేవాడు. వాటిలో ఉత్తీర్ణులైన వారికి మాత్రమే గురుపీఠంలో ప్రవేశం లభించేది.

ఒకనాటి సాయం సమయ వేళ, పదహారేళ్ళు నిండిన యువకుడొకడు చిత్రానంద స్వామిని దర్శించ వచ్చి పాదాలకు నమస్కరించి, "గురుదేవా! తమ విద్యాపీఠం ప్రసిద్ధి విని ఎంతో దూరప్రాంతం నుంచి వచ్చాను. మీ విద్యాపీఠంలో శిక్షణ పొందే భాగ్యం నాకు అనుగ్రహించవలసిందిగా వేడుకుంటున్నాను," అన్నాడు.

చిత్రానంద స్వామి, ఆ యువకుణ్ణి ఒకటి రెండు క్షణాలు పరీక్షగా చూశాడు. ఆయనకు, ఆ యువకుడి ముఖంలో ఏదో అనిర్వచనీయమైన తేజస్సు కనిపించింది. ఎంతో

జి.సి. జీవి

వినయంగా చేతులు మోడ్చి నిలబడిన ఆ యువకుడితో ఆయన, "విద్యాపీఠంలో చేర్చుకునే ముందు ఎవరికైనా పరీక్ష పెడుతుంటాను. నేనిప్పుడు, నీకొక చిన్న పరీక్ష పెట్ట దలచాను. నేనడిగే ప్రశ్నలకు, నాకు నచ్చిన సమాధానం చెప్పావంటే, పరీక్షలో నువ్వు ఉత్తీర్ణుడివైనట్టే!" అన్నాడు.

"అలాగే, ఆ ప్రశ్న ఏదో అడగండి, గురుదేవా!" అన్నాడు ఆ యువకుడు ఏమాత్రం తొణకకుండా.

"సరే! అతి సామాన్యమైన పది ప్రశ్నలు అడగమంటావా లేక ఒకే ఒక క్లిష్టమైన ప్రశ్న అడగమంటావా?" అన్నాడు చిత్రానందుడు చిరునవ్వుతో.

"క్షమించండి, గురుదేవా! గంగిగోవు పాలు గరిటెడయినను చాలు, అంటారు కదా. పది ప్రశ్నలు అడిగించుకుని, మీ విలువైన సమయాన్ని వృథా చేయడం ఉచితం కాదు. అందుచేత, ఒకే ఒక క్లిష్టమైన ప్రశ్నే అడగండి సమాధానం చెప్పడానికి ప్రయత్నిస్తాను," అన్నాడా యువకుడు. "ఐతే, తడుముకోకుండా వెంటనే సమాధానం చెప్పు. విత్తు ముందా చెట్టుముందా?" అని ప్రశ్నించాడు చిత్రానంద స్వామి.

"చెట్టేముందు, గురుదేవా!" అంటూ వెంటనే సమాధానమిచ్చాడు యువకుడు దృఢ విశ్వాసంతో.

ఆ సమాధానం విని, చిత్రానందస్వామి కొన్ని క్షణాలు ఆశ్చర్యపోతున్నవాడిలా, యువకుడి ముఖంలోకి చూస్తూ, "ఈ జవాబుకు తిరుగు లేదన్నట్టుగా – చెట్టే అని ఎలా అంతరూఢిగా చెప్పగలవు?" అని మళ్ళీ ప్రశ్నించాడు.

అప్పుడా యువకుడు, "గురుదేవులు మన్నించాలి. నన్ను ఒకే ప్రశ్న అడుగుతానన్నారు. కానీ, తమరు ఇప్పుడు నన్నడిగింది రెండో ప్రశ్న. కనక సమాధానం చెప్పవలసిన అవసరం లేదని సవినయంగా మనవి చేసుకుంటున్నాను," అన్నాడు ఎంతో భక్తిగా చేతులు జోడించి.

ఈ జవాబుకు చిత్రానంద స్వామి మొదట ఆశ్చర్యపోయినా, తర్వాత చిరునవ్వు నవ్వి యువకుడి సూక్ష్మబుద్ధికీ, సమయస్ఫూర్తికీ ఎంతగానో సంతోషించి, అతణ్ణి ఆ రోజే తన విద్యాపీఠంలో చేర్చుకున్నాడు.





# అమరఫలం

పూర్వం ఒక ముని సర్వసంగపరిత్యాగి అయి అరణ్యంలో తపస్సు చేసుకుంటూ ఉండగా, ఒకనాడు ఒక దేవత ప్రత్యక్షమై, మునికి ఒక ఫలాన్ని ఇచ్చి, "నీ తపస్సుకు మెచ్చాను. ఈ అమరఫలాన్ని చేతిలో ఉంచుకుని నువ్వు ఏది కోరుకున్నా సిద్ధిస్తుంది," అని చెప్పి అంతర్థానమయింది.

మునికి కోరిక ఏదీ లేదు. అయితే దేవత తనకు ఒకపరీక్ష కిందఈ ఫలాన్ని ఇచ్చి ఉంటుందని ఆయన భావించాడు. దాన్ని ప్రజలకు ఉపకరించే విధంగా ఒక ఏర్పాటు చేయ నిశ్చయించి, ఆయన ఆ ఫలాన్ని తీసుకుని రాజు వద్దకు వెళ్ళాడు.

రాజు మునికి తగిన మర్యాదలు చేసి, ఆయన వచ్చిన పని అడిగాడు.

"రాజా, ఇదొక అమరఫలం. దీన్ని వెల ఇచ్చి కొన్నవారికి ఒక్క కోరిక సిద్ధిస్తుంది. ఆ తరవాత దాన్ని ఇతరులకు తక్కువ వెలకు విక్రయించాలి. కోరిక తీరిన అనంతరం ఈ ఫలాన్ని ఎవరూ ఒక వారంరోజుల కన్న ఎక్కువ కాలం దగ్గిర ఉంచుకోరాదు. ఉంచుకోవటం చాలా అపాయం. దీన్ని ముందుగా నీకిస్తున్నాను. దీనికెంత వెల ఇస్తావో చెప్పు," అని ముని అన్నాడు.

రాజుకు అగత్యంగా తీరవలసిన కోరిక ఒకటి ఉన్నది. ఆయనకూ, పొరుగురాజుకూ చాలాకాలంగా యుద్ధం సాగుతూ ఉన్నది. నిష్కర్షగా ఎవరికీ విజయం చేకూరటం లేదు. ఇరుపక్షాలకూ బోలెడంత నష్టం మాత్రం అవుతున్నది. అందుచేత రాజు ఈ అమర ఫలం ద్వారా పొరుగురాజుపై విజయం సాధించాలనుకుని, ఆ పండును లక్షవరహాలకు కొన నిశ్చయించాడు.

ముని ఆ పండును రాజుకిస్తూ, "నీ కోరిక తీరిన వారం రోజుల లోపల, కొన్న ధర కంటె తక్కువ ధరకు దీన్ని ఎవరికైనా అమ్మాలి. నీ నుంచి కొనేవాడికి కూడా ఈ మాట చెప్పాలి," అని లక్షవరహాలూ రాజు నుంచి పుచ్చుకుని, వాటిని తీసుకుపోయి పేదసాదలకు దానం చేసేసి, తన దారిన తాను అరణ్యానికి తిరిగి




వెళ్ళి, ఎప్పటిలాగే దీక్షగా తపస్సు చేసుకోసాగాడు.

అమరఫలం వల్ల రాజుకు అతి త్వరలోనే సునాయాసంగా కోరిక సిద్ధించింది. మళ్ళీ యుద్ధం వచ్చినప్పుడు పొరుగురాజు చిత్తుగా ఓడిపోయాడు. ఆ రాజ్యం కూడా ఈ రాజుదే అయింది.

విజయం లభించిననాడే రాజు నిండు కొలువులో పరమానందంతో అమరఫలాన్ని అందరికీ చూపి, దాని మహిమ గురించి వివరించి, కావలిసిన వారికి దాన్ని విక్రయిస్తానన్నాడు.

దీర్ఘ వ్యాధితో బాధపడుతున్న సామంతుడొకడు దాన్ని అమితాసక్తితో తొంభైవేల వరహాలిచ్చి కొని, తన దీర్ఘ వ్యాధి నివారణ చేసుకున్నాడు.

వెంటనే అమరఫలం చేతులు మారింది. దాని ప్రభావంతో అనేకమందికి అనేక రకాల కోరికలు తీరాయి. కొందరికి వాణిజ్యం కలిసి వచ్చింది, కొందరు విద్యావంతులయ్యారు, అనేకమంది వ్యాధుల నుంచి విముక్తులయ్యారు. కోరికలు తీర్చుతున్నకొద్దీ అమరఫలం విలువ కూడా క్రమేణా తగ్గుతూ వచ్చింది.

చాలాకాలం గడిచింది. పుష్యార్కుడనే వాడికి పక్షవాతం వచ్చింది. అతను ఒకప్పుడు అమరఫలాన్ని కొని తన భార్యను మృత్యుముఖం నుంచి తప్పించాడు. ఆ అమరఫలం ఇప్పుడెంత వెలలో ఉన్నదని విచారించగా రెండు కాసులని తెలిసింది. రెండు కాసులిచ్చి దాన్ని కొంటే తన వ్యాధి నయమయ్యాకదాన్ని మరొకరికి ఒకకాసుకే అమ్మాలి.

ఇక ఆ మనిషి దాన్ని ఇంకెవరికీ విక్రయించ లేక ప్రమాదంలో పడతాడు. ఇలా అనుకుని పుష్యార్కుడు వ్యాధి నివారణకు అమర ఫలాన్ని కొనక, వైద్యుణ్ణే నమ్ముకుందా మనుకున్నాడు.

కాని అతని భార్య మాలిని తన భర్తకు తెలియకుండా రెండుకాసు లిచ్చి, తమ నౌకరు ద్వారా ఆ ఫలాన్ని తెప్పించి,తన భర్త వ్యాధి నయం కావాలని కోరుకున్నది. పుష్యా ర్కుడి వ్యాధి తీసేసినట్టు నయమయింది. తాను తీసుకున్న మందులే పనిచేశాయను కున్నా డతను.

ఇప్పుడు మాలిని అమరఫలాన్ని ఎవరి కన్నా ఒక కాసుకు అమ్మాలి. కాని ఎవరికని అమ్మటం? అమ్మితే ఆతరవాత కొన్నవాళ్ళ గతేమిటి? బాగా ఆలోచించి అమరఫలాన్ని అమ్మకుండా తన దగ్గిరే ఉంచుకుని ఏ అపాయం వచ్చినా భరించటానికే ఆమె నిశ్చయించుకున్నది.తనకు ప్రమాదం ఏ రూపంలో వస్తుందో నన్న బెదురుతో మాలిని రోగిష్ఠిదానిలాగా అయిపోసాగింది.

నౌకరు ఒకనాడు, "ఏమండి, అమ్మగారూ? వంట్లో బాగా లేదా?" అని అడిగాడు.

"ఇకనేను ఎంతోకాలం బతకనురా!" అని మాలిని చాలా విచారంతో అమరఫలం గురించి చెప్పింది.

"ఎందుకండీ అమ్మగారూ, మీరు చావ టం?" అన్నాడు నౌకరు.

"దాన్ని ఎవరికి అమ్మనురా? ఎవరు కొన్నా ఇదే చిక్కులో పడతారు. చూస్తూ చూస్తూ ఇంకొకర్ని చంపటం దేనికి? నేనే చస్తాను," అన్నది మాలిని.

నౌకరు నవ్వి, "ఎవరూ చావొద్దు! ఒకకాసుకు ఆ అమరఫలాన్ని నాకు అమ్మెయ్యండి," అన్నాడు.

"ఇంకానయం! నీ కోరిక తీరినాక దాన్ని ఇతరులకు ఎలా అమ్ముతావు?" అన్నది మాలిని.

"నే నసలు కోరిక కోరితేగద! దాన్ని పెట్టెలో దాస్తాను," అంటూ నౌకరు ఒక కాసు తీసి మాలిని కిచ్చి, అమరఫలాన్ని తీసుకుపోయి, తన ఇంట్లో కొయ్యపెట్టె అడుగున భద్రంగా దాచాడు.

అటుతరవాత అది ఏమైనదీ తెలీదు. కొంతకాలమయ్యాక చూస్తే దాని జాడ కని పించలేదు.



రాజు శాంతిదేవుడు లేకపోవడంతో, సేనాధిపతి వీరసింహుడు రాజ్యాధికారం చేజిక్కించుకోవాలని ఆరాటపడసాగాడు. అడ్డు పలికిన మంత్రి మానవేంద్రుణ్ణి, హతమార్చడానికి విఫలయత్నం చేశాడు. వసంతుడనే యువకుడు వ్యతిరేకిస్తున్నాడని తెలిసి అతనికి మరణశిక్ష విధించాడు. అయితే, ముసుగువీరుడు సమయానికి వచ్చి అతన్ని రక్షించి తీసుకుపోయాడు. కొత్వాలు వసంతుడి ఆచూకీ తెలుసుకోవడానికి ప్రయత్నించాడు.

8

# ఆర్య

అజ్ఞాత యువరాజు విచిత్ర సాహస గాథ

చిత్రాలు: గాంధి అయ్య

మీ కొడుకు ఎక్కడ?

మాకు తెలియదు!

కొత్వాలు కొరడా ఝళిపించాడు.

ఆ తరవాత పిల్లలను ప్రశ్నించాడు.

మీ అన్న ఎక్కడ?

త్వరగా చెప్పండి ... లేకుంటే ...

మీరు ఉరిశిక్ష విధించడానికి తీసుకు వెళ్ళినప్పుడే చివరిసారిగా చూశాం.

గ్రామస్థులు కొత్వాలుకు అడ్డు పడ్డారు. వాళ్ళనూ కొరడాతో కొట్టాడు కొత్వాలు.

అయ్యా, మీ రెందుకిలా మమ్మల్ని వేధిస్తున్నారు?

ఇళ్ళను తగల బెట్టండి.

శాంతిదేవ మహారాజు ఉన్నట్టయితే, మా కిలాంటి దుస్థితి కలిగేదికాదు.


అతని పేరెత్తకండి ... అతడు చచ్చాడు!
అయ్యా, మీకు పుణ్యముంటుంది. మా మానాన మమ్మల్ని ప్రశాంతంగా బతకనివ్వండి!


తగలబడుతున్న ఇళ్ళను చూసి కౌత్వాలు ఆనందంతో వికటాట్టహాసం చేశాడు.


అక్కడ అడవిలో జయానందముని, జైనగర్ సామంతరాజును చూడడానికి బయలుదేరాడు.
వానకు ఎక్కడ తలదాచుకుందాం?


బాఘా, నువ్విక్కడే ఉండు.


ముని తనరాకను తెలియజేయడానికి చిలుకను పంపాడు.
మల్లీ, నువ్వు సుఖదేవుడి దగ్గరికి వెళ్ళు!


సామంతరాజు సుఖదేవుడు చిలుక రాకను గమనించాడు.
ఇది జయానంద మునుల చిలుక కదా!
ప్రభూ! ప్రభూ!
స్వామి! స్వామి!


సుఖదేవుడు వెంటనే లేచి మునికి ఎదురువెళ్ళాడు.
స్వామీ, నమస్కారం. రండి.


స్వామీ, మొదట ఒళ్ళు తుడుచుకోండి. తరవాత మాట్లాడదాం.
ఒక ముఖ్యమైన పనిమీద వచ్చాను. నువ్వు ఏకాంతంగా ఉండడం చాలా మంచిదయింది.


శాంతిపుర పరిస్థితులను గురించి మునీ, సామంతరాజూ చర్చించారు.
రాజధాని నుంచి వస్తున్న వార్తలు చాలా ఆందోళనకరంగా ఉన్నాయి.
భయంకర విషాదం స్వామీ. రాజకుటుంబమంతా కనిపించడం లేదు!

జయానంద ముని పతకహారం తీసి సుఖదేవుడికి చూపాడు.

శిశువుగావున్న యువరాజు నాదగ్గరే ఉన్నాడు. ఈ హారాన్ని చూడు.

పతకం మీద రాజముద్రిక కనిపిస్తోంది. మీ దగ్గరున్న శిశువు యువరాజే. సందేహం లేదు.

యువరాజు సంరక్షణను నాకప్పగించండి, మహాత్మా.

వద్దు. ఆయన ఎవరన్నది తెలియకుండా పెరగాలి. నా దగ్గర ఉండడమే క్షేమం. ఆయనమీద శత్రువుల నీడ పడకూడదు.

అయితే, ఈ పతకహారం మాత్రం నీ దగ్గరే ఉండాలి, నాయనా.

తమ ఆనతి ప్రకారం దానిని భద్రంగా కాపాడుతాను. అయితే...

దానిని యువరాజుకు నేను ఎప్పుడు అప్పగించాలి? అది నా వద్ద ఉన్నట్టు ఆయనకెలా తెలుస్తుంది?

తగిన సమయంలో, యువరాజు సుమేధుడు నీ దగ్గరికి వచ్చి, దీనిని తీసుకుంటాడు.

ఇంకా వుంది

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## విజ్ఞాన వీచికలు

### ఉప్పు - దాహం

ఉప్పు కాస్త ఎక్కువగా ఉన్న ఆహార పదార్థాలను తిన్నప్పుడు మనకు నీళ్ళు మరింత ఎక్కువ తాగాలని పిస్తుంది. ఉప్పు, ఎక్కువ దప్పికను పుట్టిస్తుందన్న విషయం మనకందరికీ అనుభవమే.

ఇలా ఉప్పు దాహాన్ని ఎందుకు ఎక్కువ చేస్తుందో తెలుసా? సమాధానం చాలా సులభం. ఉప్పుకు నీటిని పీల్చుకునే గుణం ఉంది. మనం తిన్న ఆహారంలోని ఉప్పు, మనశరీరంలోని కణజాలం లోని ఉప్పును పీల్చుకుంటుంది. ఆహారంలో ఉప్పు ఎక్కువైనప్పుడు, అది ద్రవరూపంలో మూత్ర పిండాలను చేరుకునేలోగా మన శరీరకణాల నుంచి పీల్చుకునే ఉప్పు పరిమాణం కూడా అందులో ఎక్కువగానే ఉంటుంది.

శరీరకణజాలంలో నీరు తగ్గినప్పుడు అవి, ఎక్కువ నీరు కావాలని నాలుకకూ, గొంతుకూ సంకే తాలు పంపుతాయి. అదే దాహం అన్నమాట!




## మన పరిసరాలు

### పరిరక్షణే ప్రధానం!



పక్షులు ఎందుకు చెట్లపై గూళ్ళు కడతాయో మీరెప్పుడైనా ఆలోచించారా?

గుడ్లు పొదిగి, పిల్లలు వెలుపలికి వచ్చి నప్పుడు అవి ఇతర ప్రాణులకు ఆహారం కాకూ డదన్న భద్రతాభావం కారణంగానే అవి చెట్లపై గూళ్ళు కడతాయి.

రెక్కలురాని చిన్న పిల్లలు ఎగరలేవుగనక, అవి శత్రువులకు సులభంగా దొరికిపోగలవు.

గూళ్ళు చెట్లపై ఉన్నప్పటికీ, పిల్లి సుల భంగా చెట్లెక్కి పక్షి పిల్లల్ని పట్టి తినేస్తూ ఉంటుంది.

జంతువుల బరువుకు నిలవలేని ఎత్తయిన కొమ్మల్లో అయితే, మరీ క్షేమమనుకుని కొన్ని తెలివైన పక్షులు చిటారు కొమ్మల్లో గూళ్ళు కడుతూ ఉంటాయి.

తమకు వీలైనంత జాగ్రత్తగా పక్షులు గూళ్ళను కట్టుకుంటాయి!

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## మీకు తెలుసా?

ఎవరైనా గురకపెట్టి నిద్రపోతూంటే, వాళ్ళకు హాయిగా ఉంటుందే తప్ప, అదే గదిలో పడుకున్న వారికి మాత్రం నిద్రాభంగం కాక తప్పదు.

గురక హేళనచేయ తగ్గ విషయం కాదు. నిజానికి అదొక తీవ్ర సమస్య. ముఖ్యంగా అలాంటి వారి దాపుల్లో పడుకుని నిద్రపోయే వాళ్ళకు మరీ పెద్ద సమస్య.

అయినా ఈ గురక ఎందుకు వస్తుంది? జలుబు, అలెర్జీ మొదలైన కారణాల వల్ల గొంతు




భాగంలోనూ, ముక్కు ద్వారంలోనూ ఏదైనా అడ్డు ఏర్పడితే నిద్రపోయేప్పుడు గురక రావచ్చు. వెల్లకిలా పడుకున్న వాళ్ళకే మామూలుగా గురక వస్తుంది. ఈ భంగిమలో పడుకుంటే కింది దవడ బాగా తెరుచుకుంటుంది. ఆ కారణంగా నోటితో శ్వాసించడం వల్ల లోపలికి వెళ్ళే గాలికి, వచ్చేగాలికి చిరునాలుక కదులుతుంది. దాంతో గురక ఆరంభమవుతుందన్న మాట!

## లోకజ్ఞానం

## జంతు ప్రపంచం-క్విజ్

1. ఒకసారి పడుకున్న పడకను రెండవసారి ఉపయోగించని జంతువు ఏది?





2. గ్రీకు సైనికులు ఒక జలజంతువును చూసి మత్స్యకన్య అని పొరబడ్డారు. ఆ జంతువు పేరేమిటి?

3. మనుషులు చూడ లేని రంగును కీటకాలు చూడగలవా?





4. ప్రకృతిలోనే ఇతర జంతువులను చంపితి[illegible] చాలా తెలివైన బలంగ[illegible] ప్రాణి?

5. అంటార్కిటికాలో కీటకాలు ఏవైనా ఉన్నాయా?



(సమాధానాలు 66వ పేజీలో)

# ఫోటో వ్యాఖ్యల పోటీ



ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని,
చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా?
రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.


MAHANTESH C. MORABAD



SOURAA

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్టుకార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఏప్రిల్ 2004 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్‌ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.



## అభినందనలు

### డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

పి. యల్. కీర్తి
డా/ఆఫ్, పి.వి.యల్. నారాయణ
15-34, కార్వేటినగరం రోడ్
పుత్తూరు - 517 583, చిత్తూరు జిల్లా (ఆం.ప్ర)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : బొమ్మకు భలే సింగారం!
రెండవ ఫోటో : వినోదానికి ఇది సింహద్వారం!!

## సమాధానాలు

1. గొరిల్లా. రోజూ పడక తయారుచేసుకుంటుంది.
2. డుగాంగ్.
3. చూడగలవు. మనం చూడలేని అల్ట్రావయొలెట్ రంగును ఈగలు చూడగలవు.
4. మానవుడు.
5. దాదాపు 40 జాతుల కీటకాలు ఉన్నాయి.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : B. Viswanatha Reddi (Viswam)

